# The Andhra Pradesh Legislative Assembly Debates

*[Part II - Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT

---

## *37th Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

**ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY**

**Friday the 7th March, 1958**

The House met at Half Past Eight of the Clock

*[Mr. Speaker in the Chair]*

QUESTIONS AND ANSWERS

*(See Part I)*

### *Business of the House*

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) :—అధ్యక్షా. మూడు రోజుల క్రింతం నేనొక అడ్జర్న్‌మెంటు మోషనుకు నోటీసుయిచ్చాను. దానిని గురించి తెలియచెయ్యమని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—దానినిగురించి ఆఫీసులో పరిశీలన చేస్తున్నారు. మూడు రోజులయినప్పటికి లేక యింకా ఎక్కువ రోజులయినప్పటికి మనమేమీ చేయలేము.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం):—ఎడ్జర్న్‌మెంటు మోషననేది అత్యవసరమయిన విషయమును తెలుపుతుంది. దానిని ఆమోదిస్తున్నది, లేనిది వెంటనే జెప్పవలెనుగాని వారంరోజులతరువాత తెలియచేస్తామనడం సరికాదు.

మిస్టర్ స్పీకర్ :— ఈ విషయాన్ని ఆఫీసువారు నా దృష్టిలోకి తెచ్చారు. దానిని నేను disallow చేశాను.

REVISION OF THE ORDER OF DEMANDS FOR GRANTS

*The Minister for Finance (Dr. B. Gopala Reddy)* : I beg to move :

" That under Rule 32 of the Assembly Rules, the Demands for Grants for year 1958-59 be taken in the following order :

| | | Date and Time |
|---|---|---|
| Demand No. | IV- Forest Department.<br>XX- Agriculture.<br>XXI- Fisheries.<br>XXII- Veterinary.<br>XLII- Capital Outlay on Schemes of Agricultural Improvements and Research.<br>XLIX- Capital Outlay on State Schemes of Govt. Trading. | 8-3-1958(4 hours) and 10-3-1958(2 hours( |
| Demand No. | I- Land Revenue.<br>XII- District Administration.<br>XXX- Famine.<br>XXVIII- Compensation to Zamindars | 10 3-58 (2 hours) and 11-3 58 (4 hours) |
| Demand No. | XXVI- Other Miscellaneous Depts. | 12-3 58 (4 hours) |
| Demand No. | XXVII- Welfare of Scheduled Tribes, Castes, etc. | 13-3 58 (4 hours) |
| Demand No. | X- Heads of States, Ministers and Headquarters Staff.<br>XI- State Legislature. | 14-3-58 & 15-3-58 (8 hours) |
| Demand No. | IX- Irrigation.<br>XL- Capital outlay on Irrigation<br>XLIV- Capital Outlay on Multi-purpose River Schemes. | 17-3-58 (4 hours) |
| Demand No. | XXIX- Electricity.<br>XLVI- Capital outlay on Electricity Schemes. | 18-3-58 (4 hours) |
| Demand No. | XVIII- Medical.<br>XIX- Public Health.<br>XLI- Capital Outlay on Improvement of Public Health. | 19-3-58 (4 hours) |
| Demand No. | XXIII- Co-operation.<br>XLVII- Other State Works. | 20-3-58 (4 hours) |

| | |
|---|---|
| Demand No. XXIV– Industries.<br>XLIII– Capital Outlay on Industrial Development. | 22–3–58 (4hours) |
| Demand No. XXVIII–Civil works.<br>XLV– Capital outlay on Civil Works. | 24–3–58 (4 hours) |
| Demand No. XVII– Education.<br>XVI– Mines and Archaeology. | 25–3–58 (4 hours) |
| Demand No. XXXVI–Local Administration. | 26–3–58 (4 hours) |
| Demand No. XXXVII– Community Development Projects, National Extension Service and Local Development Works. | 27–3–58 (4 hours) |

and the remaining Demands will be taken up for discussion in the order given in the Notice of the list of Demands dated 25–2–1958 already circulated, excluding the demands mentioned above."

*Mr. Speaker:* Motion moved.

బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీలో అంగీకరించిన ప్రకారంగా యీ డిమాండ్ల వరుసక్రమం తయారుచేయబడింది. కాబట్టి నా ప్రతిపాదన అందరూ అంగీకరించవలె నని కోరుతున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) :-మొదటి 8 డిమాండ్లకు కలిపి ఒక రోజున 4 గంటలు, ఒక రోజున 2 గంటలు వ్యవధియిచ్చామన్నారు. ఐతే రెండు రోజులలోను ఓటింగు జరుగుతుందా లేక చర్చ అనంతరం ఓటింగు జరుగుతుందా?

రివెన్యూ మంత్రి (శ్రీ కె. వెంకటరావు):— అన్నిపద్దులను చర్చించిన మీదట ఒకసారే ఓటింగు జరుగుతుంది.

*Mr. Speaker*:- The question is :

" That under Rule 32 of the Assembly Rules, the Demands for Grants for year 1958--59 be taken in the following order :

| | Demand | Date and Time |
|---|---|---|
| Demand No. | IV- Forest Department.<br>XX- Agriculture.<br>XXI- Fisheries.<br>XXII- Veterinary.<br>XLII- Capital Outlay on Schemes of Agricultural Improvements and Research.<br>XLIX- Capital Outlay on State Schemes of Govt. Trading. | 8-3-58 (4 hours) and 10-3-58 (2 hours) |
| Demand No. | I- Land Revenue.<br>XII- District Administration.<br>XXX- Famine.<br>XXVIII- Compensation to Zamindars | 10-3-58 (2 hours) and 11-3-58 (4 hours) |
| Demand No. | XXVI- Other Miscellaneous Depts. | 12-3-58 (4 hours) |
| Demand No. | XXVII- Welfare of Scheduled Tribes, Castes, etc. | 13-3-58 (4 hours) |
| Demand No. | X- Heads of States, Ministers and Headquarters Staff.<br>XI- State Legislature. | 14-3-58 & 15-3-58 (8 hours) |
| Demand No. | IX- Irrigation.<br>XL- Capital outlay on Irrigation<br>XLIV- Capital Outlay on Multi-purpose River Schemes. | 17-3-58 (4 hours) |
| Demand No. | XXIX- Electricity.<br>XLVI- Capital outlay on Electricity Schemes. | 18-3-58 (4 hours) |
| Demand No. | XVIII- Medical.<br>XIX- Public Health.<br>XLI- Capital Outlay on Improvement of Public Health. | 19-3-58 (4 hours) |
| Demand No. | XVII- Education.<br>XVI- Mines and Archaeology. | 25-3-58 (4 hours) |

| | Date and Time |
|---|---|
| Demand No. XXXVI–Local Administration. | 26-3-58 (4 hours) |
| Demand No. XXXVIII– Community Development Projects, N.E.S. and L. D. Works. | 27-3-58 (4 hours) |

and the remaining Demands will be taken up for discussion in the order given in the Notice of the list of Demands dated 25-2-1958 already circulated, excluding the demands mentioned above."

The motion was adopeted

BUDGET-GENERAL DISCUSSION

మిస్టర్ స్పీకర్ :—బడ్జటుపై సాధారణచర్చ యీనాటితో ముగుస్తుంది. ఆర్థికమంత్రి వారి సమాధానమునకు గంటన్నర టైము కావాలన్నారు. ప్రతిపక్ష నాయకులు శ్రీ సుందరయ్యగారు ముప్పావుగంటకావాలన్నారు. అంటే తక్కిన సభ్యులందరూ 11-15 లోపల తమ ఉపన్యాసములను ముగించవలసివస్తుంది. కాబట్టి కొంతవరకు నా వీలునుబట్టి అవకాశమిస్తాను. గౌ. సభ్యులను నాతో సహకరించమని కోరుతున్నాను.

* శ్రీబి. రత్నసభాపతి (బద్వేల్):—అధ్యక్షా, సుమారు 3 రోజులనుంచి బడ్జటుపైన చర్చ జరుగుతున్నది. నేను ఇచ్చటలేకపోయినా పేపర్లలో వచ్చే వార్తలనుబట్టి యీ శాసనసభలో చేస్తున్న విమర్శలనుబట్టి శాసనసభ్యుల అభిప్రాయములను తెలుసుకోగలిగాను. ఇంతవరకు అన్నిపార్టీలనుంచి చాలమంది సభ్యులు మాట్లాడారు. ఎవరు మాట్లాడినా వారు ప్రభుత్వ చర్యలను విమర్శించారు. ఐతే ఒక విషయంమాత్రం చాలా విచారంగలిగిస్తున్నది. ప్రముఖులు కొందరు ప్రభుత్వ వైఖరిని తీవ్రంగా విమర్శించారు. కేవలం పాక్షికదృష్టితో ప్రభుత్వం తమకార్యకలాపాలను సాగిస్తున్నట్లు చెప్పడం జరిగింది. ముఖ్యంగా తెలంగాణకు యీ ప్రభుత్వంచేస్తున్న అక్రమాలను సహేతుకంగా తెలియచేయడమయినది. మా కడప జిల్లానుంచి వచ్చిన చాలమందిసభ్యులు వారిఅభిప్రాయాలు తెలిపారు. ఈ ప్రభుత్వం మా కడపజిల్లాకు కూడా వ్యతిరేకమని చెప్పగల సాదృశ్యములున్నవి. కనుక ఏ ప్రాంతాలలోనయినా వ్యతిరేకతున్నదని వేరుగా చెప్పనక్కరలేదు. శ్రీ లచ్చన్నగారు ఇది పార్టీప్రభుత్వమని చెప్పుకోడానికి వీలులేదన్నారు. ప్రజాప్రభుత్వంకాదన్నది ఎప్పుడో తెలిసింది. ఐతే ఇది పార్టీప్రభుత్వంకూడ కాదని కొందరు చెబుతున్నారు. కొందరు అనుచరులకు లేక బంధువులకు, లేక దగ్గరవారికి సానుభూతిచూపి వారికే పనులు జరపడం, వారికే ఆస్పదమున్నట్లు కనిపించడం మంచిదికాదు. ఆ విధంగా చేసినందువల్ల ప్రజాప్రతినిధులపట్ల గౌరవములేనట్లు కనబడుతుంది. ఈ ప్రజాప్రభుత్వ పార్టీ ప్రభుత్వం కాకుండా కేవలం కొన్ని క్లిక్కు్స కోసము నడుపుతున్నట్లు ఉంది. ఇటువంటి

ప్రభుత్వాన్ని ఏవిధంగా విమర్శించాలో తెలియడంలేదు. చెప్పాలంటే పదాలున్నాయి. ఐతే అవి పార్లమెంటరీపదాలు కావంటారేమోనని వాటిని ఉపయోగించడంలేదు. ఇటువంటి పరిస్థితుల్లో ప్రజల స్థితిగతులేవిధంగా ఉంటాయో తెలియడంలేదు. పోలీసు డిపార్టుమెంటుకుసంబంధించి నేను యీ సభలో ఇదివరకు విమర్శించాను. మా కడప పట్టణంలో యీ మధ్య పగటిపూట 4,5 హత్యలు జరిగాయి. ఐతే యీ విషయాల్లో ప్రభుత్వపక్షంలో వారికేవిధంగా సపోర్టు వస్తున్నదో తెలుసుకోవాలి. పోలీసువారి సామర్థ్యం తగ్గిపోయింది. వారు బాగా పనిచేయుటకు వీలులేకుండా ఉన్నది. పోలీసు కార్యక్రమాల్లో జోక్యంకలుగచేసుకొనడం, జ్యూడిషియరీలోకూడ జోక్యంకలుగు చేసుకోవడంవల్ల న్యాయంజరుగుటలేదు. పార్టీదృష్టితో గ్రూప్సు దృష్టితో అక్రమాలు జరుగుతున్నాయి. వాస్తవవిషయాలను యీసభలో తెలిపి విమర్శచేయాలంటే సభ్యులకు కూడ భద్రత లేకుండాపోతుందేమోనని భయంకలుగుతున్నది. ఇటువంటి ప్రభుత్వమును ఏవిధంగా విమర్శించాలో నాకు అర్థంకావడంలేదు.

ఆర్థికమంత్రిగారు తమ బడ్జెటు ఉపన్యాసములో కేంద్ర ప్రభుత్వం వారికి మనకు ఉన్న ఆర్థికవిషయమైన సంబంధాలు, వారుమనకిచ్చిన డబ్బుగురించిచెబుతూ, చాలా సంతోషాన్ని వెలిబుచ్చారు. యూనియన్ ఎక్సైజ్‌వల్ల కేంద్రప్రభుత్వానికి వచ్చేడబ్బు, అందులో రాష్ట్రప్రభుత్వానికి ఎంత రేటాయిస్తున్నది చూస్తే ఇదివరకటికీ, యిప్పటికీ చాలా తేడాకనిపిస్తుంది. 1952-53 సం॥ లో Finance Commission ఏర్పాటైనప్పుడు, కేంద్రప్రభుత్వానికి ఉన్న articles - 13 మాత్రమే. ఆ 13 వస్తువుల పైన వారువసూలుచేస్తూ వచ్చారు. అందులో నూటికి 40 రాష్ట్రాలకు యిస్తూ వచ్చారు. రెండవ Finance Commission ఏర్పాటైన తరువాత ఆ వస్తువుల సంఖ్య 29 వరకు పెంచారు. అందుమీద వచ్చేమొత్తం పెరిగింది. Finance Commission రిపోర్టు ప్రకారం 259 కోట్ల రూపాయలు యూనియన్ ఎక్సైజ్ వల్ల కేంద్రప్రభుత్వానికి వస్తుందని చెప్పారు. కేంద్రప్రభుత్వ బడ్జెటుప్రకారం, 300 కోట్లు వాళ్లకు వస్తుంది. ఇందులో రాష్ట్రాలకు నూటికి 25 మాత్రమే యిస్తున్నారు. అంతేకాకుండా అప్పుడు 13 articles పైన వచ్చేమొత్తములో నూటికి 40 ఇస్తూంటే ఇప్పుడు 29 articles పైన తీసుకుంటూ కేవలం 8 articles పైన వచ్చేపన్నులోనే రాష్ట్రప్రభుత్వాలకు విభజన జరుగుతోంది. ఆ 29 articles పైన వచ్చేపన్నులో రాష్ట్రప్రభుత్వానికి భాగముయివ్వాలని కేంద్రప్రభుత్వాన్ని ఎందుకు అడుగుటలేదో అర్థంకావటంలేదు. అంతేగాకుండా ఇదివరకు 40% యిస్తూవచ్చారు, యిప్పుడు 25% మాత్రమే యిస్తున్నారు. అదికూడా కొంతవరకు అన్యాయంగా కనిపిస్తున్నది, ఎందుకంటే అప్పుడు మొత్తముచిన్నది, యిప్పుడు ఎక్కువయింది. 88 కోట్ల నుంచి 300 కోట్లవరకు యూనియన్ ఎక్సైజువల్ల కేంద్రప్రభుత్వానికి వస్తున్నది. ఆ దామాషానుబట్టి యిప్పుడుమనకు యిచ్చే 2.76 కోట్లకంటే చాలాఎక్కువ వస్తు

న్నది. నా అంచనాప్రకారం, రాష్ట్రప్రభుత్వానికి 6 కోట్లు ఎక్కువరావటానికి అవకాశం ఉన్నది. ఆ విషయం ప్రత్యేకించి మన రాష్ట్రప్రభుత్వం ఎందుకు అడుగుట లేదో అర్థముకావటంలేదు.

కేంద్రప్రభుత్వానికి, మనకు loans వ్యవహారాలు కొన్ని ఉన్నవి. Finance Commission రిపోర్టుచూస్తే మనము కేంద్రానికి ఏ విధముగా అప్పుతీర్చవలెనో కొన్నిసూత్రాలు తెలిపారు. బడ్జెటుఉపన్యాసం ప్రకారం మనరాష్ట్రం 144 కోట్లకు పైబడి కేంద్రానికి అప్పుతీర్చాలి. ఈ సంవత్సరము 6 కోట్లకుపైబడి చెల్లించాలి. దానిపైన వడ్డీకూడా బడ్జెటులో 6,7 కోట్లకు పెరిగి అదంతాకూడా కట్టవలసిన అవసరం ఉన్నది. కాని కేంద్రంనుంచి యీ అప్పులు తీసుకొన్నప్పుడు, యివి ఎంత వరకు మన productive purposes కు ఉపయోగించాము,ఎంతవరకు remunerative purposes కు ఉపయోగించాము అనేది యీ లెక్కలవల్ల తెలుసుకొనటానికి అవకాశం ఉన్నది. ప్రత్యేకించి కర్నూలులో కాపిటల్‌కు రు. 13,48,000 తీసుకున్నాము. అది unproductive. మొదట ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు 4 కోట్ల ways and means కొరకు advance గా తీసుకొన్నారు. ఈ రెండు విషయాలకు సంబంధించి మన రాష్ట్రమే కాకుండా పంజాబు, West Bengal యిదే విధంగా అప్పులు తీసుకున్నాయి. Unproductive purposes కు తీసుకున్న అప్పులు write off చేయమని వారు Finance Commissionకు represent చేసుకొన్నప్పుడూ, కేంద్ర ప్రభుత్వానికి చెప్పుకున్నప్పుడూ కోరారు *Unproductive Purposes* కు ఖర్చుపెట్టినదానిమీద మనకు ఆదాయం రాదు. కేంద్ర ప్రభుత్వానికి మన టాక్సులు అన్నీ యిస్తున్నాము. కేవలం Municipal administration గా రాష్ట్ర ప్రభుత్వం తయారయినది. మన ఆదాయాన్నంతా కేంద్రమునకు యిస్తున్నప్పుడు, యీ ఆదాయము రాని unproductive purposes కు తీసుకొన్న అప్పులు write off చేయమని ఎందుకు అడగరు? వారంతా అడిగారు. అది Finance Commission రిపోర్టులో లేదు కాని, యీ విషయం consider చేయవలసిన అవసరం ఉన్నది. మన రాష్ట్ర ప్రభుత్వంకూడా ఎందుకు అడగలేదో నాకు ఆశ్చర్యముగా ఉన్నది.

ఇది Surplus Budget అని ఆర్థిక మంత్రిగారు చెప్పారు. దీనిని surplus budget గా తయారు చేయటానికి కొన్ని ప్రయత్నాలు చేశారు. అవి సంతోషించదగినవిగా కన్పించుటలేదు. కొన్ని works పైన ఖర్చులు తగ్గించామని చెబుతున్నారు. ఏ వర్కుల్నపైన తగ్గించి దీనిని surplus budget గా తయారు చేసినదీ ఆలోచిస్తే చాలా విచారకరంగా ఉన్నది. మిత్రులు వెంకటేశ్వర్లుగారు చెప్పారు. Public Health, Education పైన-యీ విధంగా తగ్గించి surplus budget గా తయారు చేశారు, కాని సరైన పద్ధతిలో surplus గా తయారు చేయాలంటే చాలా విషయాలు

ఉన్నవి. Electricity Department ఉన్నది. 1956 నుంచి లెక్కవేస్తే 54 కోట్లు Electricity Department పైన ఖర్చు పెట్టారు. ఈ డిపార్టుమెంటులో చాలా తతంగం జరుగుచున్నదని అందరికీ తెలుసు. దాని ప్రస్తావన ఆ డిపార్టుమెంటులో ఖర్చుపెడుతున్న డబ్బుని గురించి యీ అసెంబ్లీలో అపోజిషన్ సభ్యులు, కాంగ్రెసు పార్టీ సభ్యులుకూడాచెప్పారు. ఆ విషయాలను గురించి విచారణ చేస్తే తెలుస్తుంది. ఆ 54 కోట్లలో ఎంత సద్వినియోగం అయినది, ఎంత మరొక రకంగా వినియోగ మయినదీ తెలుసుకొనటానికి అవకాశం ఉండేది. కాని విచారణ జరపరు. విచారణ జరిపి, దుర్వినియోగం అవుతున్న డబ్బు సద్వినియోగంగా ఖర్చుపెట్టేందుకు ప్రయత్నం చేసి నట్లయితే చాలా లాభంగా ఉంటుంది. ఆ విధమైన చర్యలు తీసుకొని surplus budget ను తయారు చేస్తే సంతోషించేవాళ్ళము. నేను ముఖ్యమంత్రి గారికి రెండు మాసాల క్రితం ఒక నోటు వ్రాసి పంపాను. కడప జిల్లాలో P.W.D. ప్రతి నెలా ఏ విధంగా డబ్బు దుర్వినియోగం చేస్తున్నదో తెలిపాను. నెలకు 10 వేలదాకా ఆఫీసర్లు, ఇతరులు తింటున్నారు. ఆ పదివేలు ఏ విధంగా మిగల్చవచ్చునో సలహాలు యిచ్చాను. ఇదేవిధంగా P.W.D. మిగతా జిల్లాలలో చేసే కొన్ని అక్రమాలు ఉన్నవి. అవి అన్నీ ఆపితే surplus కావటానికి వీలున్నది. కాని ప్రభుత్వం ఆ విధంగా చేయుటలేదు. ఉద్యోగస్తులను retrench చేస్తున్నామని, 10 లక్షల రూపాయలు లాభం వస్తుందనీ అన్నారు. కాని మనం రెండవ పంచవర్ష ప్రణాళికలో ఎక్కువమందికి employment చూపిస్తామన్న పరిస్థితులలో retrenchment మంచి విధానమా అని అడుగుతున్నాను. ఈ రోజున మన దేశంలో 17 మిలియన్ల మంది వ్యక్తులు నిరుద్యోగులుగా ఉన్నారు. పంచవర్ష ప్రణాళికద్వారా ఉద్యోగాలు చూపిస్తామన్న మాట నిజమైతే, 8 మిలియన్ల మందికి మాత్రమే చూపించగలుగుతాము. మిగతావాళ్లకు చూపించలేము. అనగా 7 మిలియన్ల మంది నిలిచిపోతారు. ఇటువంటి పరిస్థితులలో retrenchment చేస్తే 10 లక్షలు మిగులుతాయని చూస్తే, వాళ్ల గతి ఏమవుతుంది? ఎక్కువ staff ఉన్నచోట తగ్గించి, efficiency ని పెంచటం మంచిదేగాని, తగ్గించినవారికి alternate గా యితర ఉద్యోగాలు చూపించేవరకు retrenchment చేయుట ఘోరం. దేశంలో ఎక్కువ మందికి ఉద్యోగాలు చూపించవలసిన యీ రోజుల్లో, ఉన్నవారిని తొలగించి surplus budget తయారు చేయటం సరైన పద్ధతికాదు. ఖర్చు తగ్గించవలసిన చోటు వేరే ఉన్నది. P.W.D లో Electricity Departments లో ఎంతో డబ్బు దుర్వ్యయమవుతున్నది. అక్కడ పరిస్థితులు విచారించుటకు ఒక కమిటీనో, కమిషన్‌నో ఏర్పాటు చేయగలిగితే ప్రభుత్వాన్ని అభినందిస్తాము. ఆ డిపార్టుమెంట్సుమీద చాలా ఛార్జెస్ యీ అసెంబ్లీలో చేశారు. ఆ దుర్వ్యయాన్ని అరికట్టి, డబ్బు మిగిల్చి surplus budget తయారు చేసి వుంటే ఆర్థికమంత్రిగారిని

అభినందించి ఉండేవాడిని. అవిలేకుండా retrenchment చేసి, ప్రజలకు అత్యవసర మైన Education, Public Health Department లలో ఖర్చు తగ్గించి. యీ విధంగా surplus చూపించటం అన్యాయమని మన్వి చేస్తున్నాను, వచ్చే సంవత్సరం tax వేయము అని అన్నారు.

డాక్టర్ టి. గోపాలరెడ్డి :- నేను చెప్పినట్లు జ్ఞాపకం లేదు.

శ్రీ టి. రత్నసభాపతి :- చీఫ్ మినిస్టర్‌గారు చాలాసార్లు చెప్పినారు. ఈ రోజు ఎడ్మినిస్ట్రేటివ్ సర్వీసుకు గవర్నమెంటుకు అసెంబ్లీకి కొన్ని సంబంధాలు ఉన్నాయి. అసెంబ్లీలో బడ్జెట్ పాస్‌చేసి, ప్రతి డిమాండ్‌కు కొంతమొత్తము ఎలాట్ చేసి పంపిస్తాము. మార్చి 31 వ తేదీ, ఎప్రోప్రియేషన్ బిల్లు పాస్ అవగానే గవర్నమెంటుకు ఆ డబ్బు ఖర్చు పెట్టడానికి అధికారం వస్తుంది. పబ్లిక్ అకౌంట్స్ కమిటీలో తేలిన వ్యవహారం చూస్తే, ఒక సంగతి మనకు బోధపడుతుంది. ఏ డిపార్టుమెంటులో కూడా, ఎలాట్ చేయబడిన మొత్తం పూర్తిగా వినియోగింప బడటం లేదు. చాలా మటుకు లాప్స్ అయిపోతున్నది. సెంట్రల్ గవర్నమెంట్ ఇచ్చే గ్రాంట్సు చాలామటుకు లాప్స్‌అయిపోతున్నాయి. అందువల్ల సంపూర్ణంగా పనులుపూర్తికాకుండా పోతున్నాయి. దీనికికారణం. డిపార్టుమెంటులో ఉందా, గవర్నమెంట్‌ఎలాట్ చేయటంలో ఉందా, లేక సెంట్రల్ గవర్నమెంట్ ఎలాట్‌చేయటంలో ఉందా, లేక క్రింది సర్వీసులు గవర్నమెంటుతో సరిగా సహకరించక పోవటంవల్ల ఉందా అన్నది తీవ్రమైన సమస్య. ఒక డిపార్టుమెంటుకు చేసిన ఎలాట్‌మెంటు మొత్తాన్ని సంపూర్ణంగా సద్వినియోగం చేసినట్లు లేదు. ఆ విధంగా ప్రాజెక్టులపనులు నిలిచి పోతున్నాయి. కొన్ని ప్రాజెక్టులకు ఎస్టిమేట్స్ తయారైనప్పటికి, బ్లూప్రింట్స్ తయారైనప్పటికి, అన్నీ సక్రమంగా రెడీగా ఉన్నప్పటికి, వాటికి డబ్బు ఖర్చు పెట్టకుండా,మరొకచోట ఎస్టిమేట్స్‌కాకున్నా ఇన్‌వెస్టిగేషన్ కాకున్నా, అక్కడ డబ్బు ఖర్చుపెట్టి ప్రాజెక్టుకడుతున్నారు. ఒకచోట ఎలాట్ చేసిన మొత్తాన్ని,ఇంకోచోట ఖర్చు పెడుతున్నారు. ఇన్‌వెస్టిగేషన్స్, ఎస్టిమేట్స్ రిపోర్టు తయారై, బ్లూ ప్రింట్స్ రెడీగా ఉన్నచోట్లడబ్బు ఖర్చుపెట్టకుండా, మంత్రులకు గాని, లేక ప్రభుత్వానికిగాని ఇష్టమైన వ్యక్తుల అవసరం నిమిత్తం ఇంకొక చోట ఖర్చుపెట్టటంవల్ల చాలాడబ్బు దుర్వినియోగం అవుతున్నది. మంత్రులకు, ప్రభుత్వానికి కావలసిన (ఇష్టమైన) వ్యక్తులయొక్క అవసరం నిమిత్తం అక్కడ ఉన్న ప్రాజెక్టులకు ఇన్‌వెస్టిగేషన్ మొదలు పెట్టటం; ఎస్టిమేట్స్ తయారు కావటానికి ఆలస్యం కావటం ఫిబ్రవరిలో అది శాంక్షను కావటం మార్చి ఆఖరుకు అది కాకపోవటం, ఎలాట్‌మెంట్ చేసిన డబ్బు లాప్సు కావటం జరుగుతున్నది. అంతే గాకుండా అక్కడ తొందరగా పనిచేయటంవల్ల వర్క్ సక్రమంగా జరుగక డబ్బు దుర్విని

యోగం అవుతున్నది. ఈ విధంగా ప్రతి ఎకౌంట్స్ కమిటీ మీటింగ్‌లో అనేక విషయాలు బయటకు వస్తున్నాయి, 1954 సం. లో ప్రభుత్వం 17 మీడియమ్ ప్రాజెక్టులను శాంక్షన్ చేసింది. ఈ 17 ప్రాజెక్టులలో ఒక్కదానికికూడ బ్లూప్రింట్‌సు తయారు కాలేదని నిర్ణయమై పోయింది. కాని వాటికి డబ్బు ఖర్చుపెట్టారు. 40 లక్షలు అవుతుందనుకొన్న సగిలేరు ప్రాజెక్టుకు 60 లక్ష లైనది. 35 లక్షలు అవుతుందనుకొన్నటువంటి పింఛా ప్రాజెక్టుకు ఎన్ని లక్షలు అవుతుందో చెప్పలేము. ఈ విధంగా ప్రతిప్రాజెక్టుకు అనుకొన్నదానికన్నా ఖర్చు రెంతింతలు, మూడింతలు పెరగటానికి అవకాశం ఉన్నది. ఎందుకంటె, మొట్టమొదట, ప్లాను తయారుకాలేదు. ప్లాను తాయారు చేయబడిన ప్రాజెక్టుకు డబ్బు ఎలాట్ చేయలేము. వాళ్ళకు కావలసిన ప్రాజెక్టులకు అప్పుడు డబ్బు ఎలాట్ చేసి ఇచ్చినందువల్ల, ఆ డబ్బు అంతా వృధా అయినది. సర్వీసెస్‌కు గవర్నమెంటుకు ఉన్న కో-ఆపరేషన్ చూస్తే, డబ్బు దుర్వినియోగం కావటానికి అవకాశం ఉన్నట్లు తెలుస్తుంది. సర్వీసెస్ ఇప్పుడున్న గవర్నమెంటుతో సంపూర్ణంగా సహకరిస్తోందని నేను నమ్మటంలేదు. గవర్నమెంట్ పార్టీలో గ్రూపు లేర్పడటమే కాకుండా, సర్వీసెస్‌లో కూడ రాజకీయాలు వచ్చాయి. గవర్నమెంట్‌కు సర్వీసెస్‌కు సంబంధాలు సరిగా లేకపోవటం వల్ల డబ్బు దుర్వినియోగం అవుతున్నది. కాబట్టి ఇటువంటి పరిస్థితులలో, కేవలం పాక్షికదృష్టితో పోయినందువల్ల ఎటువంటి ఫలితాలు వస్తాయో ఆలోచించవలసి ఉన్నది...

*శ్రీమతి సి. అమ్మన్నరాజా (అత్తిలి):- అధ్యక్షా, సాధారణంగా, ఈ సెకండ్‌ప్లాన్ పైములో, సర్‌ప్లస్ బడ్జెటు అన్నదానిని మేనేజ్ చేయటం చాలా కష్టమే అయినప్పటికి, ఈనాడు మన ఆర్థికమంత్రిగారు, దానిని ప్రెజంట్ చెయగలిగారు. ఎంతో కష్టపడి, ఎన్నో విధాల డబ్బు సేకరించి, సర్‌ప్లస్ బడ్జెట్‌ను మన ఫైనాన్స్ మినిస్టర్‌గారు ప్రజంట్ చేశారు. అందుకు వారికి అభివందనాలు కాని, చాలా విషయాలలో అనేక డిపార్టు మెంట్సు డబ్బు అడుగుతూ౦టే, 'డబ్బులేదు' డబ్బులేదని" వారికి ఇవ్వటానికి నిరాకరించి, ఈ విధంగా సర్‌ప్లస్ బడ్జెట్ చేయటం మంచిదా; లేక కష్టపడి మనకు కావలసినవన్నీ చేసుకొని, కొంతడబ్బు లోటు ఏర్పడినా, డెఫిసిట్ బడ్జెటు చేయడం మంచిదా అన్నది ఆలోచించ వలసిన విషయము. "బడ్జెట్ డిఫిసిట్ చేస్తే, అప్పులు ఎక్కువ అవుతాయి. ఆ అప్పులు తీర్చుకోవటం చాలా కష్టం, అందుచేత సర్‌ప్లస్ బడ్జెట్ చేస్తేనే మంచిది" అని మన ఫైనాన్స్ మినిస్టర్‌గారు ఆలోచించి ఉంటారు.

ఈనాడు ప్రభుత్వం అనేక టాక్సులువేస్తున్నది. ఈ టాక్సులు వేయటం ముఖ్యంగా పల్లెటూరి ప్రజలలో చాలా అసంతృప్తిగా ఉన్నది. వాళ్ళలో అసంతృప్తి లేకుండా చేయటం కష్టమే, పల్లెటూళ్ళలోని రైతుల దగ్గరనుండి ఎగ్రికల్చరిస్టుల దగ్గర

ఎన్నోరకాల పన్నులుపనూలు చేస్తున్నాము.కాని, వారికి సంతృప్తికరంగా ప్రయోజన కరమైన పనులు ఏమైనా చేయగలిగినామా అంటే,అదికూడ చేస్తున్నట్లు కనిపించదు. సంవత్సరం పొడుగునా ఎంతో కష్టపడితేతప్ప రైతులు తమకు కావలసిన పంటలు పండించుకోలేరు. సాధారణంగా నెలకువందరూపాయలు సంపాదించుకొనే గుమాస్తా ఆదాయంతో సమానంగా, ఈనాడు 5 ఎకరాలు ఉన్న రైతు పంట పండించి సంపాదించ లేకుండా ఉన్నాడు. ఎండకు ఎండి వానకు తడిసి, ఈ నాడు రైతు ఎంతో కష్టపడి పంట పండించు కొంటూంటే. అతనిమీద అనేక రకాల పన్నులు వేస్తున్నాము కాని వారికి ఎటువంటి సౌకర్యాలైనా చేయగలిగామా అంటే లేదు. కమ్యూనిటీ డెవలెప్‌మెంట్ బ్లాక్‌లని. నేషనల్ ఎక్స్టెన్‌షన్ సర్వీసు బ్లాకులని పెట్టారు అనుకోండి. దాంట్లోకూడా ప్రజలు కొంత భాగం కంట్రిబ్యూషన్ ఇస్తేగాని పనులు జరగటం లేదు. ఈ కంట్రిబ్యూషన్ గ్రామస్థులు ఇవ్వాలంటే, చాలా కష్టం. గ్రామాలలో పేదరైతులే చాలామంది ఉంటారు. పెద్ద పెద్ద రైతులు కొద్దిమంది మాత్రమే ఉంటారు. అసలు వారికి పన్నులు చెల్లించుకోటమే కష్టంగా ఉంటే తిరిగి ఈ పనులకొరకు కంట్రిబ్యూషన్ ఇవ్వటం ఇంకా కష్టం. డెల్టా ఏరియాలో ఉన్న బీదగ్రామాలు కంట్రిబ్యూషన్ ఇవ్వలేకపోవటంచేత అభివృద్ధి పొందలేకుండా ఉన్నాయి. కొంచెం కంట్రిబ్యూషన్ ఇచ్చుకోగలిగినవారు మాత్రమే ఈ అభివృద్ధి పనులు చేయించుకో గలుగుతున్నారు. ఈనాడు పల్లెటూళ్లలోని రైతులు చాలా అసంతృప్తితో ఉన్నారు. వాళ్లకు త్రాగటానికి శుభ్రమైన నీళ్లువుండవు చుట్టూ కాలువలు ఉన్నప్పటికీ, వారికి త్రాగటానికి ప్రొటెక్టెడ్ వాటరు ఉండదు. డ్రయినేజ్ ఉండదు తాము పండించుకొన్న పంటను అమ్ముకొనుటకు తీసుకొని పోవటానికి సరైనరోడ్ల సౌకర్యాలు లేవు. బళ్లు నడిచే టట్లుగా ఆ రోడ్లులేవు. మనుష్యులే బళ్లను తోసుకు వెళ్లవలసి వస్తుంది. ఆ విధంగా కష్టాలు పడుతున్న వారిమీద మనం ఎక్కువ పన్నులువేసి డబ్బు తీసుకొంటున్నాము.

అక్కడ వైద్యసౌకర్యాలు లేవు. ప్రసూతి విషయంలో ఆడవాళ్ళు చాలా దూరం బళ్లలో ఈ రోడ్లమీద వెళ్ళి ఎన్నో కష్టాలు పడుతున్నారు, వారికి దారిలోనే ప్రాణాలు పోయిన విషయాలుకూడ ఉన్నాయి. ఈ పనులు సోషల్‌వెల్‌ఫేర్ డిపార్టుమెంట్ ద్వారా చేయించుకో వచ్చును కదా, అని అంటారు. దానికికూడ కంట్రిబ్యూషన్ ఇవ్వాలి. కంట్రిబ్యూషన్ ఇవ్వలేనివారు సౌకర్యాలు చేయించుకోలేక పోతున్నారు. అటువంటివారి విషయం ప్రత్యేకంగా ఆలోచించి, కొన్నిపథకాలు ఏర్పాటు చేస్తేతప్ప, ఈ గ్రామాలు వృద్ధిలోనికి రావు. నేడు గ్రామాలలో ఎంతో దుమ్ము ఎంతో అశుభ్రము ఉంటున్నది. అక్కడ ఎన్నో జబ్బులు వస్తున్నాయి కాని అక్కడ వైద్యసౌకర్యాలు లేవు. ఈ విధంగా కుగ్రామాలలో ప్రజలు చాలా బాధలు పడుతున్నారు. చూడటానికి మాత్రం అది చాలా ప్రాస్పరస్ ఏరియా. అక్కడపంటలు

పండుతాయి గనుక, అది ప్రాస్పరస్ ఏరియాఅని అంటారు. మనకు ఉన్న ఇండస్ట్రీ అది ఒక్కటే. కాని ఈ పంటలను చౌకధరలకు ఇతర రాష్ట్రాలకు పంపుతున్నారు. మన ఇండియా గవర్నమెంటువారు 80 కోట్లు ఖర్చుపెట్టి, ఆహారధాన్యాలు ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకొంటున్నారు. కాని మనదేశంలో ఎంతో కష్టపడి పంట పండించే రైతుకు ఎటువంటి ప్రోత్సాహం ఇవ్వటంలేదు. అందరికి భోజన సదుపాయం కలిగిస్తున్న రైతుకుకొంత ఎంకరేజ్‌మెంట్ కలుగచేయాలి. రైతు ఎంత పంట నయితే సప్లయిచేస్తాడో, అంత పంటకు బస్తాకు ఇంత అని కొంత డబ్బు సహాయం చేస్తే అతడు తన ప్రాంతంలో రోడ్లు వేసుకోటానికో, నూతులు త్రవించుకోటానికో. హాస్పిటల్స్ పెట్టించుకోటానికో వీలవుతుంది. అలా కాకుండా, ఈనాడు ఆహారధాన్యాల ధరలపై కంట్రోల్స్ పెట్టి, మనదగ్గరనుంచి ధాన్యమంతా తీసుకొంటున్నారు. ఆహారధాన్యములు అమ్ముకోటానికి రైతులకు గిట్టుబాటుగాధరలు ఉండేటట్లు ఏదైనా ఒక ఏర్పాటుచేయబడము చాలాఅవసరమే కనుక ప్రభుత్వము కొంతశ్రద్ధ వహించికృషిచేయాలని అంటున్నాను. ఎదో Jones ను ఏర్పాటుచేశారని అంటున్నారు. Jonesను ఏర్పాటుచేయడంవల్ల ఆహారధాన్యాలకు ధరలుపడిపోతాయని రైతులు భయపడుతున్నారు. Jones ఏర్పాటును గురించి మంత్రులు ఏవేవో సమాధానాలు చెబుతున్నారేగాని, అవి సంతృప్తికరంగ కన్పించడములేదు. ఏమైనప్పటికినీ, యీ పరిస్థితిని బాగుచేయటానికి ప్రభుత్వము ఏదైనా ఒక ఆలోచనచేయవద్దా అని అడుగుతున్నాను. విదేశాలతో వ్యాపారముచేసే విషయములో Exchange వ్యవహారాలలో కష్టములు ఉంటాయి గనుక మనరైతులను కొంతవరకు ప్రోత్సహించటానికి ఏదైనా ఒక మార్గమును కనిపెట్టాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

*[Srimathi T. Laxmikanthamma in the Chair]*

ఇతర రాష్ట్రాలతో మనము స్నేహముభావముతో వుండడము అవసరమనడము నిజమేకావచ్చు. మద్రాసురాష్ట్రములోగాని, మైసూరురాష్ట్రముతోగాని, ఒరిస్సా రాష్ట్రముతోగాని అవి వాస్తముగ మనకు సరిహద్దురాష్ట్రాలు గనుగ, స్నేహముగనే మనము వ్యవహరించుచున్నాము. కాని మనము ఏవిధముగవారితో స్నేహముగ ఉంటున్నామో,వారుగూడ ఆ విధముకనుండవలెనుగదా ; ఆ విధముగ ఉండడములేదే. ఒక్క ఉదాహరణ చెబుతున్నాను. ఇప్పుడు మద్రాసురాష్ట్రము తీసుకొండి. మనము స్నేహ భావముతో ఏండ్లతరబడి కాలము గడిపాము ఆ రాష్ట్రములో తెలుగువారు చాలామంది ఉన్నారు. ఇక్కడ మనరాష్ట్రములో అరవవారు ఎంతోమంది ఉన్నారు. ఇక్కడ మనము అరవవారను treat చేస్తున్నట్లుగా, అక్కడ అరవవారు మన తెలుగువారిని treat చేయడము లేదు, మద్రాసు రాష్ట్రములో తెలుగువారు, ఇక్కడ మన రాష్ట్రములో అరవవారు. అల్పసంఖ్యకు లైనారు. అయినప్పటికిని మనము ఇక్కడ అరవ వారికి అవసరమైన సదుపాయములు చేయుటకు సిద్ధముగ ఉన్నాము.

చేస్తున్నాముకూడా। మనరాష్ట్రమునుంచి గోదావరి జలాలను మద్రాసు రాష్ట్రానికి పెన్నద్వారా తీసుకుని పోవాలని అడుగుతున్నారు. అది ఇవ్వవచ్చు తప్పేమి లేదు మనము అరవవారికి ఇన్ని విధములుగ సహాయపడుతూంటే, అక్కడ వారు మనకు సౌకర్యాలు ఏమైనా ఇస్తున్నారా? నిన్నటి Indian Express పత్రికలో చూడండి ఏమని ప్రచురించారో। మద్రాసు రాష్ట్రములో Tamil ను State Language ని చేశారు. ఇదివరకు ఉన్న మాదిరిగ అక్కడ ఇతర languages లో tests అన్నింటిని మాన్పించివేశారని ప్రచురించారు. కేంద్రప్రభుత్వం Hindi ని Official languageగా చేస్తామని అంటే Hindi ని Official language చేయటానికి మాకు ఇంకా time కావాలి, ఇంగ్లీషు ఇంకా కొంతకాలము వరకు ఉండాలని అంటున్నారు. మిగిలిన రాష్ట్రాలు కూడ అదేమాదిరి time కోరుతున్నాయి అనుకోండి. మనము ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు చేసుకొని విడబడి వచ్చినను, ఇంకా చాలా మంది అక్కడ మిగిలిపోయినారు. ఒక్క తెలుగువారే కాకుండా, ఇతర భాషలు మాట్లాడేవారుకూడ కొద్దిగా ఉన్నారు. మిగిలిపోయినవారిలో ఆంధ్రులే ఎక్కువమంది ఉన్నారు. తెలుగుభాషలో ఇదివరకు పెట్టిన Language tests యిప్పుడు అక్కడ లేదని అంటున్నారు. ఈ విషయమును గురించి Indian Express లో పడింది చదువుతున్నారు.

"The Government have directed that the Language Tests prescribed under the special rules for the various State and Subordinate Services should be abolished except in the case of Sub Registrars in the Registration Department who are recruited direct, and Assistant Curator in the Government Museum etc. Consequent on the re-organization of States, Tamil has become the official language of the State by an Act of the Legislature and an adequate knowledge of it has been prescribed for recruitment of personnel for the various State and Subordinate services in the State. The special Rules for the various state and Subordinate Services prescribed language tests in Telugu, Urdu, Malayalam Kannada and Hindi which were considered desirable to enable the officers to carry on the administration in the set-up that existed prior to the re-organization of the States. Now that Tamil has become the Official Language of the State, it is considered that there is no necessity for language tests in other languages prescribed for the officers in the various services in that the remaining population of the people speaking languages other than Tamil is not sufficiently large to justify the retention of the Tests in those languages"

అని వ్రాసి ఉన్నది. ఇప్పుడు నేను చెప్పేది ఏమిటంటే, మనము ఎన్నోఏండ్లుగా వాళ్ళతో కలిసి ఉన్నము. మద్రాసు తెలుగు వారిదా. "అరవవారిదా" అనే సంశయముతో ఉండి ఉన్నాము అంటే, అక్కడ మద్రాసు State లో తెలుగువారు. అరవ

వారు ఉన్నారు అన్నమాటే. ఒక్క మద్రాసు సిటీలోనే కాదు. ఇతర జిల్లాలలోకూడ ఉన్నారు. ఇప్పుడు వారందరు ఒక్కసారిగా ఎట్లా మాయమై పోగలరు? Tamil రానటువంటి వారికి అందరికి 10,15 సంవత్సరాలు టైము లిమిట్ పెట్టి, వారు అందరు Tamil నేర్చుకోవాలనే మాదిరిగ చెబితే, ఇక వారందరు బైటకు ఎక్కడికైనా వలస పోవలసి ఉంటుందనా? Ceylon లో కూడ State Language Tamil, చేయమని agitate చేస్తున్నారు. అలాంటప్పుడు మద్రాసులో తెలుగువారు అల్ప సంఖ్యాకులుగ ఉన్నప్పుడు తెలుగుభాష ఎత్తివేస్తే, సిలోనులో అరవవారు అల్ప సంఖ్యాకులు అయినప్పటికినీ అరవము పెట్టమని ఎట్లా కోరుచున్నారు? కాబట్టి ఇది చాలా అన్యాయముగ ఉన్నది కాబట్టి యీ విషయము మంత్రుల లెవెల్‌లో కొంత వరకు చర్చించాలి. మద్రాసులో సర్వసామాన్యంగా సగానికి సగము తెలుగువారు ఉంటున్నప్పటికినీ, అల్పసంఖ్యాకులుగ treat చేస్తూ తెలుగును ఎత్తివేయడము అన్యాయము. ఈ విషయములో కొంత హక్కులతో కూడిన సహాయము అక్కడ తెలుగు వారికి వచ్చేటట్లు చేయాలని మంత్రి వర్గాన్ని కోరుతున్నాను. ఇదేమాదిరి అనేక విషయాలు ఉన్నవి. ఇప్పుడు నాకు అంతగా టైము లేదు గనక వాటినన్నింటిని గురించి చెప్పలేక పోతున్నాను. కాని మన ఎసెంబ్లీకి సంబంధించిన విషయము ఒక్కటి మాత్రము చెప్పి కూర్చుంటాను.

మన ఎసెంబ్లీకి lady members కొంతమందిమి ఎన్నుకోబడి వచ్చాము. ఏదో స్త్రీలు వచ్చినను, వారియందు మేము న్యాయముగానే చూస్తున్నాముకాని, వారిలోవారే న్యాయము చేసుకోలేక పోతున్నారని అంటున్నారు. న్యాయము చేయటానికి లేడీ మెంబర్లే అక్కర్లేదు. Lady Members అక్కరలేదనుకుంటే, ఇక్కడకు ఇంత తంటాలు పడిరావడమెందుకు? ఇంత కష్టమెందుకు? అది కాదు అసలు విషయము. మొన్న Business Advisory Committee లో ఎసెంబ్లీ ఉదయం 8-30 గంటలకు సమావేశ మయ్యేటట్లుగా నిర్ణయించారు. ఎసెంబ్లి ఆ ప్రకారము ఉదయము 8-30 నుంచి 1-30 గంటల దాకా కూర్చోవడమనేది ముఖ్యంగా మావంటి స్త్రీలకు చాలా inconvenient గా ఉంటున్నది. మాకు కూడ guests ఉంటారు; పిల్లలు ఉన్నారు. సరిగా తొమ్మది గంటలు అయ్యేసరికి భోజనముల వేళ అవుతోంది. నిజానికి ఈ ఎసెంబ్లిలోగూడ తొమ్మిది పది గంటల మధ్య లేడీ మెంబర్లు ఎవరైనా ఉంటున్నారేమో చూడండి. మగవారు ఇక్కడికి ఉదయము 8-30 గంటలకు రావాలంటే, ఇంట్లో వాళ్ళు ఆడవారు వంటలయారు చేస్తారు, గనక వాళ్లకు ఏమీ inconvenient గా ఉండదు. 1-30 గంటలు కాగానే ఇళ్ళకు వెళ్ళి భోజనముచేసి విశ్రమించటానికి వీలుగా ఉంటుదని వారు అభిప్రాయ పడవచ్చు. కాని Lady Members విషయము అలాకాదు. ఈ విషయము కొంతవరకు ఆలోచించాలని అంటున్నాను. కనీసము Demand ను గురించి discussion కు

వచ్చే టప్పటికైనా Leaders of all parties అందరు కూడ ఈ timings లో కొంత మార్పు ఆలోచించమని అంటున్నాను.

Business Advisory Committeeలో గాని, Estimates Committeeలో గాని Tirupathi Devastanam Board లో గాని, ఇలాంటి కమిటీలలో పని చేయగల Lady Members ఉంటే, వారిని కూడ వేయవలెనని కోరుతున్నాను.

ఎసెంబ్లీ timings మార్పును గురించి ఆలోచించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ పి. నరసింహప్పారావు (పాలకొండ):- అధ్యక్షా, 1958-59 సంవత్సరమునకు ఆర్థిక మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జటును గురించి కొద్దిగా మాట్లాడ దలచు కున్నాను. మన ఆర్థికమంత్రి శ్రీగోపాలరెడ్డిగారు బడ్జటుతయారుచేయ డములో మన భారతదేశము మొత్తముమీద ఆవిధముగ తయారు చేసేవారు లేరనే నా నమ్మకము. ఆర్థికమంత్రిగా ఆయనకు ఉన్న అనుభవము మరెవ్వరికినీ లేదు. పూర్వము మనము మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడుకూడ ఆయన ఆర్థికమంత్రి పద విలోనే ఉన్నారు. ఈనాటివరకు ఆర్థికమంత్రిగానే ఉన్నారు. కనుక ఆయనకు ఎన్ని సంవత్సరముల అనుభవమున్నదో ఆలోచించవచ్చు. కనుక ఆయనకంటే నిపు ణుడు ఎవరు ఉండరనే నా నమ్మకము, ఆయన ఎప్పుడు ప్రవేశపెట్టినను లోటు బడ్జటుతప్ప మరి surplus budget ప్రవేశపెట్టడము అనేదిలేదు. కాని ఈ సంవ త్సరముమాత్రం Surplus Budget తీసుకొని వచ్చారు.ఇందులో ఏదోగొప్పవిశేషము ఉందనుకుంటాను. కాని ఒక్క విషయము మాత్రము మనవి స్తాను. ఏదో సామెత చెప్పినట్లు 14 రొట్టెలు తయారుచెస్తే తినేవారికి 12 రొట్టెలు పెట్టి తక్కినవి రెండుకూడ తినటానికి ఎక్కువ అయిందని చెబుతూ ఈ రెండు మిగిల్చి వేస్తున్నాడు. Surplus అదేవిధంగా చూపిస్తున్నారు. ఇప్పటికివారు 14 రకముల పన్నులు వేశారు. ఇక మీదటవేస్తే ఏమీలాభములేదని మాను కున్నారు. గోపాలరెడ్డిగారు ఇప్పటికి 10 సంవత్సరాలనుంచి ఆర్థికమంత్రిగా ఉంటున్నారు. ఏ దృష్టితో చూచినప్పటికినీ వారి దృష్టిలో శ్రీకాకుళం జిల్లా ఉన్నదా లేదా అనే అనుమాన పరిస్థితి కలుగ జేస్తున్నారు. మా జిల్లాలోని పనులను చేయ మని కోరితే ఇప్పుడు డబ్బులేదు అంటున్నారు. వంశధార ప్రాజెక్టుకు 20 కోట్ల రూపాయలు కావాలి. మన ప్రభుత్వం ఇప్పుడు డబ్బుఖర్చు చేయగల స్థితిలోలేదు. కాబట్టి దానిని వెనక్కు నెట్టారు. సంతోషమే. పాలకొండ తాలుకాలోని నందివాడ ప్రాజెక్టు విషయం 1949-51 సంవత్సరములో ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఆర్థిక మంత్రిగా గోపాలరెడ్డిగారు వచ్చి చూచారు. Estimates తయారయికూడ దీనికి

కొంత grant చేయాలనేమాట గోపాలరెడ్డి గారిదృష్టి ఉన్నట్లు ఎక్కడా కనిపించదు. శ్రీకాకుళం జిల్లావారు యీ మంత్రివర్గాన్ని చాలావిమర్శిస్తున్నారు. M.L.A గా రాలేకపోయిన వారికి M.L.A. ను విమర్శించడానికి అవకాశం కలుగుతుంది. అట్లాగే మంత్రిపదవి పోయినవారు మంత్రివర్గంమీద ఎప్పుడు దెబ్బకొడదామా అని ఆలోచిస్తూ 24 గంటలూ విమర్శిస్తూనే ఉంటారు. కాని మేము చేసే అటువంటి విమర్శనకాదు. గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్నకాలంలో నాకు 3 నెలలైనా మంత్రిపదవి ఇవ్వమనికోరినాను. మా జిల్లాలో ఉన్న పనులను పూర్తిచేయికుందామనే అభిప్రాయంతో అట్లు అడిగినాను కాని నాకు ఆటి అవకాశం లభించలేదు. ఇప్పుడు ఎవరికి మంత్రిపదవియిస్తే ఏమిజరుగుతుందో. ఇవ్వకపోతే ఏమి జరుగుతుందో అనేస్థితిలో సంజీవరెడ్డిగారు వున్నారు. ఏమనిషికి మంత్రిపదవి ఇవ్వకపోతే ఎక్కడ దెబ్బకొడతాడో అనేరీతిగా ఉన్నది. మా జిల్లావారికి మంత్రిపదవి ఇవ్వకపోయినా, యివ్వడానికి అవకాశంలేకపోయినా కాని అక్కడ నందివాడ ప్రాజెక్టుపని పూర్తిచేయించాలని మనవిచేస్తున్నాను. ఏవిధంగా చూచినప్పటికినీ మా జిల్లానుంచి ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయమే వస్తున్నది. కృష్ణా, గుంటూరు జిల్లాలకంటే ఎక్కువ ఆదాయంవస్తుందనుకోవడం పొరపాటు. మా శ్రీకాకుళం జిల్లాకు మంత్రి లేకపోయినా, ఉన్నట్లుగానే భావించి అట్టిపనులు పూర్తిచేయించాలని మనవిచేస్తున్నాను. ఈ విషయాలన్నీ దృష్టిలోపెట్టుకుని వచ్చే సంవత్సరమైనా నందివాడప్రాజెక్టు పనిపూర్తిచేయిస్తారనుకొంటున్నాను.

N.G.Os. విషయమై యీ బడ్జటులో ఏమీ చూపబడలేదు. నందికొండ ప్రాజెక్టు P.W.D. Works కింద, Block Development పేరుతోను అక్కడి జీపులకు ఒక్కరోజు ఖర్చుచేసే Petrol ఖర్చు N.G.Os. కు యిస్తే సరిపోతుంది. ఒక్కరోజు అయ్యే Petrol ఖర్చును మిగిల్చినట్లయితే N.G.Os. కు సంవత్సరం పొడుగునా హెచ్చుజీతం యివ్వడానికి సరిపోతుందని మరోసారి మనవి చేస్తున్నాను. P.W.D లో work చేసేవాడూ, చేయించేవాడూ, inspection చేసేవాడూ అందరూ లంచగొండులే అయితే ప్రభుత్వం స్థిరంగా ఎంతకాలం పనిచేయగలదని అడుగుతున్నాను. లంచగొండితనం నిర్మూలించబడిననాడు మాత్రమే ఆంధ్ర ప్రదేశ్ బాగుపడడానికి అవకాశంఉందని మనవిచేస్తున్నాను. పనిచేసేవాడు దొంగ, చేయించేవాడూ దొంగే అయితే వారిని ఎవరుపట్టుకోగలరు? 'ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టుకోలేడు' అనే సామెతగా ప్రభుత్వంయొక్క ఇంటిలోనే దొంగలున్నారు. వారిని ఎవరుపట్టుకోగలరు? contract పుచ్చుకునేవాడు దొంగ, contract ఇచ్చేవాడు దొంగ. ఇద్దరూ దొంగలే. లంచగొండితనం నిర్మూలించిన నాడే పరిపాలన బాగు పడుతుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :— పనిచేసేవాడు, చేయించేవాడూ దొంగలే. అందరూ దొంగలే అనడం పార్లమెంటరీ యేనా?

శ్రీ పి. నరసింహప్పారావు :— దొంగతనం అంటే ఇక్కడ లంచగొండి తనం. లంచగొండితనం ఎక్కువగా ఉన్నదని మనవిచేస్తున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వడమలపేట) :— దొంగనుపట్టుకోడానికి దొంగే కావాలి.

శ్రీ పి. నరసింహప్పారావు :— లంచగొండితనాన్ని ప్రభుత్వం ఎప్పుడు నిర్మూలింపజేస్తుంది. Judicial లో భగవంతుడు న్యాయాధికారుల బుర్రమీద ఉంటాడు. బ్రిటిష్ ప్రభుత్వకాలంలోనే కాదు ఇప్పటికీ, ఏ ప్రభుత్వం time లో అయినా సరే Judicial లో కూడా లంచగొండితనం పెరిగింది. మా శ్రీకాకుళం జిల్లాలో యిద్దరిని First Class Magistrate ను, Munsiff ను Suspension లో పెట్టారు. అది Judicial అవునా, కాదా? Judicial లో లంచగొండితనం అనేది యిదివరకెన్నడైనా విన్నారా? లంచగొండి తనాన్ని రూపుమాపిన రోజునుంచే పరిపాలన సరైన మార్గంలో నడవగలదని మనవిచేస్తున్నాను

శ్రీకాకుళం జిల్లావిషయమై "అంతామనవాళ్ళే," అనే సామెతగా చెప్పారు. మొన్నటిరోజున లచ్చన్నగారు. "మొన్నటి elections లో అక్కడలేను" అని లచ్చన్నగారు చెప్పారు. కాని బ్యాంకు ఎలెక్షన్సు సందర్భంలో ఆనాడు లచ్చన్న గారు అక్కడనేఉన్నారు. లచ్చన్నగారికీ మాకూ ఏమాత్రం సంబంధంలేదు అని ఎవ్వరూ చెప్పలేదు. బ్యాంకుకు ఇప్పుడు ఎలక్షన్సు పెట్టమనండి. ప్రజలంతా అందుకు సిద్ధంగా ఉన్నారు. శ్రీకాకుళం జిల్లాలో బ్యాంకు ఎలక్షనులు కావాలి. 'వద్దు' అని ఎవ్వరూ చెప్పలేదు. ప్రభుత్వంకూడా 'ఎలక్షన్సు వద్దు' అని ఆర్డరు వేయలేదు. "అంతామనవాళ్లే" అనేసినిమా మోస్తారుగా కాకుండా పరిపాలించాలి. కనుక ఈనాడు ఎలక్షనులు జరిపించమనండి. లచ్చన్నగారికి సంబధంలేదు అంటే మాత్రం నేను ఒప్పుకోను. వారికి సంబంధం లేకపోతే అసలు ఆ విషయం ఎందుకు move చేయాలి? సంబంధం ఉండబట్టేవారు దానిని గురించి మాట్లాడారు. సంబంధం లేదంటే ఒప్పుకోను. లచ్చన్నగారు చెప్పినది న్యాయంకాదు. ఈ విషయం వారికీ బాగా తెలుసును. ఎలక్షన్సు జరిగిన రోజున వారు అక్కడే ఉన్నారు. Special Officer గారు ఉన్నారు. ఆరోజున నేనుకూడా మాట్లాడి నాను. ఏమీ సంబంధంలేదు అనడం బాగాలేదు. ఇప్పుడే ఎలక్షనులు పెట్టినట్లయితే అందులో పాల్గొనడానికి అందరూ సిద్ధంగా ఉన్నారు. కాబట్టి తప్పకుండా ఎలక్షనులు జరిపించాలని మనవిచేస్తున్నాను.

శ్రీకాకుళం జిల్లాలో జిల్లాబోర్డులు, పంచాయతీ బోర్డులూ ఉన్నాయి. ఆ బోర్డులు ఏ పనులుచేసినా ప్రజలు సుఖపడరాము. సంతోషిస్తాము అనుకొంటే ఆ పంచాయతీ బోర్డులు తెంపులేకుండా ఎన్నో రకాల పన్నులు విధిస్తున్నాయి. ప్రజలు గోలపెడుతున్నారు. ప్రభుత్వం యీ విషమై కొంచం యోచనచేయాలని మనవి చేస్తున్నాను. చేతిలో అధికారం ఉన్నది. పన్నులువేస్తున్నారే తప్ప ప్రజలకు ఏమి సదుపాయాలు కలుగజేస్తున్నారు? ఇప్పటికి 14 రకాలుగా పన్నులువేశారు. ఒక రూపాయికి ఇంకొక రూపాయిపెంచినారు. ప్రతిఫలంగా ప్రజలకు చేసేసదుపాయం ఏమిటి?

మంత్రిగారి ప్రసంగంలో భూసంస్కరణల ప్రస్తావనే లేదు. భూసంస్కరణలు ఎప్పుడు వస్తాయా అని ప్రజలు మేమంతాకూడా ఎదురుచూస్తున్నాము. బడ్జెటులో దానినిగురించి ఏమీ ప్రస్తావించకపోవడం విచారకరమైనది. శ్రీకాకుళం జిల్లాకు సంబంధించిన సందివాడ ప్రాజెక్టును వచ్చే సంవత్సరమైనా పూర్తిచేస్తారని ఆశిస్తున్నాను. మద్రాసు రాష్ట్రంలో ఉండగా అర్థిక మంత్రిగారు వచ్చిచూశారు. ఆ ప్రాజెక్టు గరివిడి. సుమారు లక్ష ఎకరాలు ఉంటుంది. Betterment Tax యిచ్చు కుంటామని ప్రజలు మెమోరాండాలుపెడుతున్నారు. కోట్లకొలదిడబ్బు ఖర్చుచేయా లంటే డబ్బు లేదనుకోవచ్చును. కాని స్వల్పమాత్రం ఖర్చుతోనే ఆ ప్రాజెక్టు పూర్తి అవుతుంది. కాబట్టి వెంటనే చేయిస్తారని ఆశిస్తూవిరమిస్తున్నాను.

మిస్టర్ ఛైర్మన్ :— 'దొంగలు' అనేపదం Parliamentary యా, un-Parliamentary యా అని గౌ॥ మంత్రిగారు యిందాక అడిగినారు. General గా ఆపదం ఉపయోగించినప్పుడు Parliamentary యే. ఏమీ అభ్యంతరంలేదు. కాని ఫలానా వ్యక్తి దొంగ అన్నప్పుడు un-Parliamentaryఅవుతుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :— P.W.D Engineers అంతటా దొంగలు, Executive Engineers అంతా దొంగలు అంటే ఫరవాలేదా?

మిస్టర్ ఛైర్మన్ :—General గా అన్నారు కాబట్టి ఫరవాలేదు.

*Sri B. V. Gurumurthy (Secunderabad-Contonment)* Mr. Chairman Sir, I have great pleasure in rising to congratulate our Finance Minister for the sound budget proposals he has placed before the House, for the year 1958-59. The budget estimates appear to have been based more on principles of status quo than on dynamism; they are not eflective of any radical change in the socio-economic policies of our Government.

Before I examine the budget estimates for the current year, I propose to say a word on the character of the previous budget. According to the budget estimates for the year 1957-58, our accounts were to close with a deficit of Rs.5.48 crores; but actually theyended in a surplus

of Rs. 3.12 crores. This serious divergence has been explained as being due to the improvement in the receipts positon and the fall in expenditure. While the increase in receipts is due to Finance Commission's recommendations, it must be ascribed that the fall in expenditure is due mainly to administrative lapses, such as, delays, ineptitude, and so on and so forth. Huge sums of money are not spent in time for months on; works are not taken up and if they are taken up they are taken up in the eleventh or twelfth month and are rushed through. Consequently large sums remain unspent and they get lapsed; and many constructive works which are very useful to the society remain unimplemented. Sir, this is a serious matter and our Finance Minister should see that the expenditure programme of all departments is phased in an even manner so that works are not rushed through in the eleventh hour, as otherwise it would constitute a serious reflection on our administrative machinery.

Sir, we must also congratulate our Finance Minister for having reconciled with the idea of nationalisation of transport. We remember last year he was opposed to the nationalisation of bus transport for two reasons: one was, it was not feasible and the other was it was not profitable. But, when the Government as a whole took a decision to nationalise bus transport, he has provided the necessary funds. Hence our congratulations to him.

Sir in my view nationalisation of bus transport and introduction of land reforms constitute two distinct milestones in our journey towards socialism. But, land reforms we are also aware, are halting and delayed and perhaps a bit vacillating. But, in the present context, it is not the extent of nationalisation, but the principle and the policy of nationalisation that is of significance. Our Chief Minister should not merely be content by being the Leader of the House or of the Party; he should try to lead the thought and action of the State as a whole, he is responsible for delivering the goods of socialism in our State; he is committed to create a socialistic society in our State and he should not be found wanting, because he is presiding over our destinies today. I have pointed out in the beginning, land reforms are a bit halting. As a result of the ordinance recently promulgated, big jagirdars have alienated many of their lands to their kith and kin, and have also sold much to tenants and others and amassed huge sums of money; the ordinance has enabled them to make afortune

While thus big land lords have amassed vast sums of money, the lot of the teachers and the N.G.Os. remain unchanged. Teachers and N.G.Os. are an important section of our society. They must also receive a square deal from the Government. In Telangana,it is common knowledge that our wage structure is based on an economic wage rather

than a living wage. It is not so in the case of Andhra. It is therefore necessary that the teachers and the N.G.Os. should also come to a par with their counter-parts in Telangana. Teachers mould the lives and character of our children. If our standard of education has to improve, it is very necessary that the teachers' lot should improve. If the N.G.Os. have to give their best, it is necessary that their lot also should be improved. And the Government should take adequate steps and the wherewithal to provide a living wage to teachers and N.G.Os can be found by imposing a sort of cess or surcharge on all transfers of land that had been effected during the ordinance period. Or, another alternative is that agricultural income-tax may be imposed and the sum so realised can be utilised for the benefit of N.G.Os. and teachers. While the Government of India has described the Andhra rice millers for their various activities as unsocial, it is very unfortunate that our Minister for Agriculture should encourage them, to agaiate for abolition of zonal system and for prevention of ceilings on land, and to agitate for higher prices for their produce. Higher prices for big land lords will be detrimental to the interests of the labourer, the kisan the artisan, the shop-keeper the middle class men and the countless unemployed millions in our country. It is therefore necessary that our Minister should take a more realistic view of things and stop encouraging big land lords demanding higher prices.

*Dr. B. Gopala Reddi*:- Not big land lords. What should happen to petty land lords, one-acre man, two-acre man, etc! That is all what he wants.

*Sri B. V. Gurumurthy*:- Sir, this has been a matter of controversy for a long time. The Planning Commission's recommendations are there and the President of the Andhra Provincial Congress Committee Mr. Alluri Satyanarayana Raju has been saying time and again that this will really benefit the big land lords. This, I submit, is a matter of controversy and I still believe in the wisdom of the Planning Commission.

Sir, although the Zonal system is introduced in the State and has been in operation for some months past, that was not effectively carried on. Smuggling of rice has been going on merrily and no check has been imposed so far. Unless proper steps are taken to check such smuggling, I am sure the prices of food stuffs would rise and so the cost of living. It is therefore necessary that the Government should at least stop smuggling of rice to areas other than the zone allotted to Andhra.

Sir, the budget is silent on unemployment situation and the steps the Government have taken to provide more employment. In my view, if a separate railway zone is constituted for Andhra area with

Secunderabad as its headquarters. I am sure it would open up more opportunities for our educated young men, Secunderabad City provides all amenities, workshops and other facilities, to constitute an ideal headquarters for a railway zone Other States have agitated and got such zones. If our Government take up this matter with the Central Government, I am sure they will concede this demand of ours. Similarly, the Estimates Committee of the Indian Parliament has recommended Hyderabad City as headquarters for Indian Airlines Corporation. If our Government take up this matter with the Centre, I am sure they will agree to locate the headquarters of I. A L. C. in Hyderabad. The climatic conditions, the availability of land and other facilities have attracted their attention. Similarly Sri Jagjivan Ram, who is the Minister for Communications, had promised to locate the I. A. F. at Begumpet. That promise has not been fulfilled so far. If our Government take up this matter also with the Centre, I am sure they will locate one of their offices here. All these three would go a long way in improving the employment situation and our educated young men would get more jobs.

Last but not the least, the Government should take note of the chorus of discontent and dis-satisfaction evidenced in the speeches of all the speakers coming from Telangana, irrespective of party or group. It is clear from their speeches that they have apprehensions and fears and they have also made serious allegations. All these fears have to be allayed; allegations have to be either disproved, or if true they should be removed. Unless such a thing is done, the fears remain unchanged and fissiparous tendencies are likely to grow in this part of our Andhra Pradesh. Similarly Telangana for historical reasons has been backward and this should be recognised by the rest of Andhra Pradesh and they should try to bring them to their own level at least in matters of education and health. Telanganites too must realise that merger is an inseparable link and they must get reconciled to that. They must not allow separatist tendencies to grow. And together with Andhra, let us all strive for a complete integration, such as what is called, the emotional integration with Andhra.

श्री बानप्पा (मक्तल-आम): माननीय अध्यक्षजी। अभी हमारे सामने माननीय आर्थिक मन्त्रीजी ने जो बजेट पेश किया है वह असंतोष जनक है। इसमें जो कुछ बतलाया गया है वह सब मिनिस्टर्स के मकानों और गारडंस के लिये और उन्हें पूरी सहूलतें फराहम करने के लिये बनाया गया है। इसमें कहीं भी प्रजा के हित के लिये कुछ भी नजर नहीं आता। इसमें बतलाया गया है कि छ: लाख रूपये चीफ मिनिस्टर अपने बंगले के लिये खर्च करते हैं। इसी तरह डा० पट्टाभी रामाराव ...

डाक्टर बी० गोपाल रेड्डी : जरा आप तफसील से बतलाइए यह छ: लाख क्या है, कहां हैं ?

श्री बानप्पा : मैं डिमेंड्स के वक्त सब तफसील बताऊंगा। इसी तरह एजूकेशन मिनिस्टर अपने मकान के एस्टेब्लिशमेंट के लिए ७५ हजार रूपये खर्च करते हैं। यह कहां का इंसाफ है। मैं पूछना चाहता हूं कि क्या महात्मा गांधी ने हमको यही बतलाया था। क्या हम इसी लिए स्वराज के लिये लडे थे। आज एरकन्डीशंड मकानों में बैठकर बजट बनाते हैं लेकिन यह बजेट हमारी समझ में नहीं आता। मैं यह भी कहूंगा कि तेलंगाना की आमदनी लेजाकर आंध्र में खर्च करना यह बिलकुल नाइन्साफी है और तेलंगाना को दिये हुए सेफ गार्ड्स के खिलाफ है। इससे पहले माननीय आर्थिक मन्त्री ने वादा किया था कि तेलंगाना की एक एक पाई तेलंगाना के मफाद ही के लिए खर्च की जायगी। लेकिन इन १५ महीनों में ही हम देख रहे हैं कि तेलंगाने के पौने छ: करोड रूपये लेजाकर आंध्र में खर्च कर रहे हैं। क्या यह बात तेलंगाना को दिये हुए सेफ गार्ड्स के खिलाफ नहीं है ?

इससे आगे बढ़कर जब हम देखते हैं तो पंच वर्षिय प्रणालिका है। इसमें मुझे चीफ इंजीनियर ओवरसियर्स और पी डब्लू डी के कांट्रेक्टर्स के मफाद के सिवा और कुछ नजर नहीं आता। किसी कांट्रेक्टर के जरिये कोई बिल्डिंग बनवाई जाती है और वह एक ही वर्ष में गिरकर खतम होजाती है। यह समझ में नहीं आता। जितना भी पैसा खर्च करते हैं उसमे कुछ हासिल नहीं होता। आगे चलकर आप देखें तो यह मालूम होगा कि श्री संजीव रेड्डी जो आज गवर्नमेंट चला रहे हैं वह यही चाहते हैं कि "माइ विल ईज़ ला" My will is law यानी वह समझते हैं कि मैं जो कहता हूं उसीको कानून समझो। यह डेमोक्रेसी के खिलाफ है। इसके बाद आगे चलकर देखे तो मालूम होता है कि अबतक तेलंगाना-रीजनल कमेटी कायम नहीं की गई। क्यों कायम नहीं की गई समझमे नहीं आता। विशालांध्र कायम होते वक्त हमारे आंध्र भाई वाकदान दिए थे किन्तु मै पूछता हूं कि अब तक रीजनल कमेटी क्यों कायम नहीं की गई।

उस्मानिया यूनिवर्सिटी के बारे में लास्ट अक्टोबर को काफी एजीटेशन हुवा था और डी० एस० रेड्डी के खिलाफ बहुत कुछ हुवा था। उस वक्त

तेलंगाना के एक मिनिस्टर ने वादा किया था कि मैं आइंदा मीटिंग में यूनिवर्सिटी के चारटर को चैंज करवाता हूं और यह कि वाइस चांसलर के अपाइंटमेंट के लिए एलेक्शन का तरीखा रखा जाएगा। मगर अबतक वह ऐसा क्यों नहीं किए। क्या मैं रंगा रेड्डी साहब से तवक्को कर सकता हूं कि वह इस महीने के आखिर तक ऐसा करवादेंगे नहीं तो वह अपना इस्तेफा देकर घर बैठजायेंगे। क्या मैं उनसे ऐसा सवाल कर सकता हूं ?

एलक्ट्रीसिटी डिपार्टमेंट में तथा के० सी० केनाल में जैसा कि हमारेली डर ने फरमाया और श्री एकबोटे ने भी फरमाया महकुमे बरकी मे काफी घपला हो रहा है। के सी केनाल तथा इस महकुमे के लिए मै कहूंगा कि चीफ़ इंजीनियर के खिलाफ़ छागला कमीशन की तरह का एक निपक्षपात कमीशन बिठाकर जांच करवाई जाय तो बहुत अच्छा होगा।

अब तक बहुत से लोग वरंगल कालेज के बारे मे कहते आये हैं। कल ही मान्नीय मन्त्री से इसका समाधान भी मिला है। जिस तरह हाउस में कहा गया है मैं फौरन वरंगल मे कालेज खोलने के लिए दरखास्त करता हूं।

पोलिस के उपर हमारे बजेट का कई करोड रूपया खर्च होता है। मैं इस पोलिस का एक छोटा विषय आपको बतलाता हूं। पोलिस कानून पर निगरानी करनें के लिए होती है लैकिन हालत यह है कि इसी कामपाउंड में जहां कानून बनता है पोलिस कानून की खिलाफ़ वर्जी करती है। मै बतलाता हूं मैंने २८–२–५८ को देखा इस काम्पाउंड में जो रिजर्व पोलिस सेफ़ गार्ड के लिये रखी गई है उसी के कुछ लोग झाड के नीचे बैठकर जुव्वा खेल रहे थे। अगर यही लोग इस तरह करते रहें तो कानून की कैसे पाबन्दी होगी। और अफसोस की बात तो यह है कि इनपर गवर्नमेंट का कई करोड रूपया खर्च होता है।

इससे पहले मैंने मान्नीय मन्त्रीजी के पास हमारे सेवाग्राम नारायनपेट में वीवर्स कोआप्रेटिव सोसाइटी को ५० हजार रूपये रिबेट मिलना है उसके बारें में मेमोरेंडम दिया था। वहां की सोशलिस्ट पार्टी की तरफ़ से भी मेमोरेंडम दिया गया है। लैकिन इसका कोई जवाब नहीं दिया। क्या वह मेमोरेंडम मिनिस्टर साहब की जेब में रहगया था क्या हुवा मेरी समझ में नहीं आता। आजकल

डेमोक्रेसी के जमाने में मिनिस्टर्स के जिम्मेदाराना लेवल पर इस तरह करना बहुत बुरी बात है ।

आगे चलकर मैं अपनी कान्स्टीटुवेन्सी के बारे में दो शब्द कहकर खतम करदूंगा । सिविल वर्क्स में हमारी कान्स्टीटुवेन्सी के दोरेपल्ली ग्राम के नाम पर दो लाख रूपये एलाट किए गए हैं । क्या मैं हुकूमत से तवक्को कर सकता हूं कि जो रखम एलाट की गई है उससे काम पूरा किया जायेगा और रखम को लेप्स होने न दिया जायेगा ? क्या हुकूमत कामों को फोरी चालू करने में मदद देगी । मैं यह कहुंगा कि महकुमे तामीरात तथा पी डब्लू डी मिनिस्टर के पास एक रोड को जो अब तक कच्ची है पक्का बनाने के लिए याददाश्त पेश की गई । लेकिन उसपर अबतक कुछ नहीं हुवा । गुजश्ता श्री बी० रामकृष्णराव गवर्नमेंट के जमाने में भी इसबारे में रिप्रेजेंटेशन किया गया था । लेकिन अब भी उसके बारे में बजेट में जिक्र नहीं आया है । इससे साफ जाहेर होता है कि पक्षपात होरहा है उसके सिवा कोई और बात नहीं । सब रखम आंध्र में खर्च करना चाहते हैं । और पी० डब्लू० डी० जनता के लिए नहीं बल्कि मिनिस्टर्स वर्कस डिपार्टमेंट बनाया है । मेरी समझ में नहीं आता कि आप तेलंगाने के लिए कुछ भी क्यों नहीं करना चाहते । यह बुरी बात है । एजूकेशन डिपार्टमेंट में आप ५२० टीचर्स को अपने ओहदों से निकाल दिए हैं । आप तो यह कहते हैं कि निरुद्योग को दूर करेंगे । क्या इसी तरह करने से निरुद्योग दूर होगा । गवर्नमेंट का इस तरह करना समझमें नहीं आता । इसीलिए मैं इस बजेट को असंतोषजनक प्रकट करता हुं और हुकूमत से कहुंगा कि आज आप मेजारिटी के बल पर पूरे डिमैंड्स पास करवालेंगे किंतु मैं कहुंग कि सदस्यों के विचारों पर भी ध्यान दीजिए ।

मैं माननीय अध्यक्षजी का आभारी हुं कि उन्हों ने मुझे यह समय दिया । उनका आभार मानते हुए मैं अपना भाषण समाप्त करता हूं ।

శ్రీ వి. కూర్మయ్య (గుడివాడ-రిజర్వుడు) :— అధ్యక్షా ! గౌరవనీయులైన ఆర్థిక మంత్రిగారు, చాలా కష్టపడి, డిఫెసిట్ బడ్జెటులేకుండా చేయాలని రెండు సంవత్సరములనుండి ప్రయత్నించుచు, నేటికి ఆంధ్ర ప్రదేశ్‌కు సర్‌ప్లస్ బడ్జెటును ప్రవేశపెట్టినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. అయితే కొంతమంది మిత్రులు చెప్పినరీతినే నేను కొన్ని విషయాలు వారి దృష్టికి తేవలచుకొన్నాను. ఆంధ్ర

ప్రదేశ్‌కు సర్‌ప్లస్ బడ్జెటును తయారుచేయటం చాల కష్టమే అయినప్పటికి, యింకా ఎక్కువ పన్నులువేసి. యింకా సర్‌ప్లస్‌ను చూపి, ఆ డబ్బును సాంఘిక చిక్కులను తీర్చటానికి, వెల్‌ఫేర్ స్కీములను ఎక్కువగా చేసినట్లయితే యింకా ఎక్కువగా ఆర్థిక మంత్రిని అభినందించేవాడిని. సెక్యులర్ స్టేటును, వెల్‌ఫేర్ స్టేటును స్థాపించాలనే ఉద్దేశ్యముతో, యీ ప్రభుత్వాన్ని మనం స్థాపించాము. మన రాజ్యాంగంలోకూడ అదే ఉంది. కాని ఈ బడ్జెట్టు విధానాలు, Proposals ఆ Welfare State స్థాపించుటకు అనుగుణంగా లేకపోవుట విచారకము. మూడు సంవత్సరముల క్రితం సోషలిష్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటీని స్థాపించవలెనని తీర్మానించాము. ఇంత వరకు ఆస్థాపనకు యే కొంచము ప్రయత్నం అయినా ప్రభుత్వ పరంగా జరిగినదా యని అడుగుతున్నాను? అటువంటి పనికి పూనుకొనేటట్లుకూడా అంతగా కనుపించుటలేదు. ప్రజలకు కావలసినవి తినుటకు తిండి–కట్టుటకు బట్ట. దాని కోసం ఈ ప్రభుత్వం పనిచేయడంలేదు. డెమోక్రసీ పేరుతో డిక్టేటర్‌షిప్పును చలాయిస్తోంది యీ ప్రభుత్వం. ప్రజలబాధలగురించి, వారు అనుకొను విషయాలను గురించి, విచారించవలసిన బాధ్యత ప్రభుత్వంపై యున్నది. నిజమైన ప్రజాప్రభుత్వం అయినట్లయితే, ప్రజలను ఉత్సాహవంతులుగాచేసి, ఆ సోషలిష్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటీని స్థాపించడానికి కృషి ప్రారంభించాలి. ఈ నాడు ప్రభుత్వాన్ని నూటికి ఇరవై మందిగా యున్న advanced Community పరిపాలిస్తోంది. నూటికి 80 మందిగా యున్న హరిజనులకుగాని, tribal Communities కుగాని, Backward Classes People కుగాని, మంత్రి పదవులలోనూ, ఉద్యోగాలలోను, కమిటీలలోను సరియైన representation లేదు. కర్నూలులో ఉన్నప్పుడు, అప్పటి ముఖ్యమంత్రిగారైన గోపాలరెడ్డిగారిని " మీరు చాలా ఇంపొటెంట్‌గా యున్నారని " అన్నాను. ఎందుచేతనంటే కొన్ని కొన్ని విషయాలలో మంత్రులు తప్పు చేస్తోంటే విచారించమని నేను గోపాలరెడ్డిగార్ని కోరాను. కాని అప్పట్లో వారు, " ఆ మంత్రులనే కలుసుకొని చెప్పమని " జవాబు చెప్పారు. వారి పట్ల నేను అన్నమాటలను withdraw చేసుకొంటున్నాను. కాని యిప్పుడుమాత్రం ముఖ్యమంత్రిగారు పొటెంటుగా ఉన్నారు. మిగతా మంత్రులంతా ఇంపొటెంటుగా యున్నారు. ముఖ్యమంత్రిగారు యేవిధంగా చెబితే ఆవిధంగా మిగతా మంత్రులు నడుచుకొంటూయున్నట్లు తెలుస్తున్నది. ఆయన డిక్టేటర్‌గా వ్యవహరిస్తున్నారు. దానికి ఒక ఉదాహరణకూడ మనవిచేస్తున్నాను. గత సంవత్సరం— Medical College లో హరిజనులకు 54 సీట్లు ఉండే సందర్భంలో, ఒక G. O. జారీచేసి మంత్రివర్గంతో సంప్రతించకుండా ఆ సీట్లు హరిజనులకు రాకుండా చేశారు. సమిష్టి మద్రాసు రాష్ట్రం నుంచికూడా ఈ admissions వ్యవహారం కేబినట్ చూస్తోందేది. దీనిని డెమోక్రసీ అంటారా? డిక్టేటర్‌షిప్ అంటారా? ఈ మాటలు unparliamentary కాదు అనుకొంటున్నాను. మంత్రులంతా శక్తిహీనులుగా యున్నారు. మొత్తం మీద చూచినట్లయితే ఈ ప్రభుత్వం

కమ్యూనల్ ప్రభుత్వంగా వ్యవహరిస్తోంది. ఆంధ్ర ప్రదేశ్ పెద్ద రాష్ట్రం. ఇక్కడ కుల, మత, దురభిమానాలకు తావు ఉండరాదు. ఏ కాంగ్రెస్ అయితే జాతీయతా భావాలతో ఉండాలని కోరిందో. అ కాంగ్రెస్ నేడు—జస్టిస్ పార్టీలో ఉండే గుణాలతో, దయార్కీ భావాలతో నిండిపోయిందని చెప్పడానికి విచారిస్తున్నాను. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం వారు కులాల ప్రాతిపదికగా ఉద్యోగాలు యిచ్చి భారత దేశంలో అనైక్యతకు తోడ్పడ్డారు. సరిగా ఈరోజునకూడా అదే జరుగుతున్నది. నూటికి 63 గురుగా యున్న హరిజనులకు, యితర Backward Classes కు 33 శాతం. ఉద్యోగాలు యిస్తూ నూటికి 33 గురు గాయున్న advanced Class People హిందు పులకు 66 శాతం ఉద్యోగాలు యిస్తున్నారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— హిందువులు అంటే క్రిష్టియన్సు, బ్రాహ్మిన్స్, నాన్ బ్రాహ్మిన్స్ అందరూ ఉంటారు

శ్రీ వి. కూర్మయ్య:— మహాత్మా గాంధీగారు ఏమని చెప్పారు? మైనారిటీల మీద మెజారిటీ వారి ఒత్తిడి భారత దేశంలో యెప్పుడూ ఉండదని ఎన్నోసార్లు ఎందరికో హామీ యిచ్చారు. దేశంలో మైనారిటీ వర్గమైన హరిజనులు మొదలైన Backward Classes ను పైకి తీసుకుని వచ్చుటకే ఆయన ప్రయోజన ఓటింగు హక్కును కోరారు. మనం ఈ రోజున ఎవరిని 'డూప్' చేసి పైకి వచ్చేందుకు వీలు లేదు. ఆరోజులు మారినాయి. ప్రజలు మేలుకొంటున్నారు. ఈ మధ్య జరిగిన నాల్గు బై ఎలక్షన్స్ లో కాంగ్రెస్ ఓడిపోవుటకు కారణం ఏమిటి? అసంఖ్యాకమైన వెనుకబడిన తరగతుల వారి అండను కాంగ్రెస్ కోల్పోవుటే। హరి జనులకు, ప్రభుత్వం చేయదగిన పనులు చేయుటలేదు. హరిజనులకు భూములురాకుండా ఆపుచేశారు కళా వెంకట్రావుగారు. ఆయన దృష్టిలో ఒక తూర్పు గోదావరి జిల్లా మాత్రమే కనుపడుతోంది: ఇలా హరిజనులకు వచ్చే భూములను ఆపడం దుర్మార్గం అని చెబుతున్నాను. "భూమి భోగం దానికంటె చౌక అయిందని" అన్నారు వెంకట్రావు గారు "మాల వాళ్లు, మాదిగ వాళ్లు యెవరిష్టం వచ్చినట్లు వాళ్లు ఆక్రమించుకొంటు న్నారు— యిది ఎవరి తాతగారి సొమ్ము" అని రెవిన్యూమంత్రిగారు అన్నారు. "ఇది కళావెంకట్రావుగారి తాతగారి సొమ్మా" అని నేను అడుగుతున్నాను. ఈ విధంగా అవహేళనగా మాట్లాడుట మంచిదిగాదు. అందుకోసమే వెనుక బడిన జాతులవారు మేల్కొన్నారని చెపుతోంట। ఇటువంటి పరిపాలనను యింకవారు సహించరు. ఈ భూసంస్కరణలను ఎవరు కావాలని అన్నారు? ముందు ఈ పోరంబోకు భూములను లంక భూములను పేదవారికి పంచిపెట్టండి. తరువాత సంస్కరణలు మాట చూచు కొందాము. హరిజనులకు స్కాలర్ షిప్పుల గురించి కోట్లకొలది రూపాయలు యిస్తున్నామని ఆర్థిక మంత్రిగారు చెప్పారు. అందుకు వ్రభుత్వాన్ని అభినందిస్తు

న్నాను. కాని యిది ఊరికే చేసే సహాయంగా మాత్రం ఎంచకండి. కష్టపడి దేశానికి కావలసిన ఆహార పదార్థములను పండిస్తున్నది యీ నాడు హరిజనుడు, వెనకపడిన తరగతులవారని గ్రహించితె, ఆ సహాయానికి వారు అర్హులని తేలుతుంది. ఇక్కడ ఉన్నటువంటి హరిజన సభ్యులందిరికి మనవిచేసేది ఏమిటంటే, ఏ విధమైన అన్యాయాలు జరుగుతున్నప్పటికి ఉపేక్షింపక ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చి సరిదిద్దవలసినదని కోరుతున్నాను.

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు:— (రాజమండ్రి) అధ్యక్షిణీ: ఈ రోజున గోపాలరెడ్డిగారు మిగులు బడ్జెట్‌ను తెచ్చారని చాలా మంది సభ్యులు వారిని అభినందిస్తున్నారు. It is only on juglary of figures కాకపోయినా మిగులుచేయాలంటే మిగులుచేయవచ్చు, తరుగు చేయాలంటే తరుగుచెయవచ్చు. ఇదంతా అంకెల మార్పులు. ఖర్చులు తగ్గిస్తే యింకా ఎక్కువ మిగులుతుంది. అందుకని నేను ఆయనను మాత్రం అభినందించ తలచుకోలేదు. ఇది మిగులైనా తగులైనా, యిది కాబినెట్ యొక్క joint responsibility. ఈవేళ ఇంతవరకు పన్నులువేసినపట్పికీ, ఒక్క గోపాలరెడ్డిగారు స్వతంత్రంగా, వ్యక్తిగతంగా వేసిన పన్నులు కావవి. అది మంత్రివర్గం అంతా ఒప్పుకొన్న తరువాత వేసిన పన్నులే కాబట్టి ఆయనగారిని నిందించి ఏమీలాభంలేదు. కేంద్రప్రభుత్వం ఏర్పాటు చేసిన Finance Commission వారు ఈ రోజున సుమారు 11 కోట్ల రూపాయలు అదనంగా యిచ్చారు. కాబట్టి ఇది మిగులుకావచ్చు. గోపాలరెడ్డిగారు తమ budget ఉపన్యాసం ఆఖరి పేరాలో "ఇది మిగులు budget కదా అని సంతోషపడవద్దని ఆఖరి సమయం వచ్చేసరికి కష్టాలుకూడా వున్నాయి, కొంచెం జాగ్రత్తగా చూసుకోవాలని" ముగింపు వాక్యాలతో చెప్పారు. విశాలాంధ్ర కావాలని చాలా సంవత్సరాలనుంచి ప్రయత్నం చేసి చివరకు విశాలాంధ్రను తెచ్చుకొన్నాం. అదివచ్చి 1-1½ సం॥రం॥ కాక మునుపే అప్పుడే ఆంధ్ర రాష్ట్రంనుంచి వచ్చిన వారికి తెలంగాణానుంచి వచ్చినవారికికూడ అభిప్రాయ భేదాలు కలిగాయి. ఆంధ్ర ఉద్యోగులు, తెలంగాణా ఉద్యోగులు ఎవరు మట్టుకువారు తమకు చాలా అన్యాయంజరిగిందంటున్నారు. కనుక ఈ ప్రభుత్వం ఏ services ను ఎలాసంతృప్తిపరుస్తుందో నాకర్థం కావడంలేదు. ఎప్పటికైనా services చేత సరిగా ఉద్యోగం చేయించదలుచుకొంటే ఉభయ ప్రాంతాలనుంచి వచ్చిన ఉద్యోగస్థులను తృప్తి పరచి ఈ రాష్ట్ర పరిపాలన చేయవలసి వుంటుందని నేను ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాను. కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చి పది సంవత్సరాలైనా Red Tapeism మాత్రం తగ్గలేదు. మా జిల్లాలో ఒక Trust Property విషయంలో 3 సంవత్సరాలుగా ఒక కాగితం నడుస్తోంది. దానిని నేను స్వయంగా తీసుకువెళ్ళి మంత్రివర్గానికి Secretariat లో యిచ్చాను. Secretariat చుట్టూ Religious Endowment Office చుట్టూ తిరుగుతున్నాను. Special Officer కు report ఇచ్చి

ఎనిమిది నెలలైంది. అది Revenue Board కు వెళ్ళిందని, Secretariat కు వెళ్ళిందని చెబుతున్నారు. ఒక మాసం క్రితం office లో కనుక్కుంటే ఇంతవరకు కాగితం రాలేదని చెబుతున్నారు. ఇది ఎందుకు ఆలస్యం అవుతోందో కారణం తెలియదు. దయచేసి కాంగ్రెస్ ప్రభుత్వంలో యీ Red Tapeism తగ్గించి వేయడానికి ప్రయత్నం చేయవలసిందిగా కోరుతున్నాను. 1957-58 సంవత్సరం Bubget లో కేటాయించిన సొమ్ము ఒక కోటి అరువది రెండున్నర లక్షల రూపాయిలు ఖర్చుచెయ్యక మురిగిపోయింది. ఈ విధంగా కేటాయించిన డబ్బును ఖర్చు చేయలేని అసమర్థత ప్రభుత్వానిదో లేక Department దో నాకు తెలియడం లేదు. కాబట్టి కేంద్ర ప్రభుత్వం యిచ్చిన grants లో ఒక కోటి అరపై రెండు లక్షల రూపాయలు తగ్గిపోయింది అంటే మన ప్రభుత్వం ఏ విధంగా నడుస్తోందో కొంచెం ఆలోచించుకోవాలి. ఈ సంవత్సరం revenue ఖాతాలో రెండు కోట్ల యాభై ఎనిమిది లక్షలు తరుగు చూపించారు. ఇతర పన్నులవల్ల రు. 31 లక్షలు minus, విద్యుచ్ఛక్తి పథకాల ద్వారా రు. 71 లక్షలు minus, రోడ్డు రవాణాద్వారా రు. 10 లక్షలు minus ఇతర పద్దుల ద్వారా రు. 9 లక్షల minus కనపడుతోంది. ఫలానా చోట విద్యుచ్ఛక్తి scheme కావాలని అడిగితే, అది remunerative అయితే కాని మేము take up చేయమని అంటున్నారు. Remunerative అయినప్పటికీ రు. 33 లక్షలు నష్టం ఎలా వస్తుందో నాకు అర్థం కావడంలేదు. కాబట్టి ఈ విషయాలన్నిటిలోను సరైన శ్రద్ధ వహిస్తేనే ప్రభుత్వాన్ని హర్షిస్తారు. 1958-59 సం॥రంలో ప్రణాళిక క్రింద ఖర్చు ఆ క్రిందటి సంవత్సరం ఖర్చుపెట్టినదానికన్న యింకా చాలా తక్కువ. దీనికి 1956-57 లో రు. 29 కోట్లు కేటాయిస్తే రు. 24 కోట్లు మాత్రమే ఖర్చయింది. 1957-58 లో రు. 38 కోట్లకు రు. 31 కోట్లే ఖర్చయింది. 1958-59 సంవత్సరానికి రు. 30 కోట్లు కేటాయించారు. ఇందులో ఎంత ఖర్చు అవుతుందో చెప్పలేము. రెవిన్యూ ఖాతాక్రింద కాకుండా, యితర పెట్టుబడి ఖర్చులు చూపిస్తూ, విద్యుచ్ఛక్తిమీద 1957-58 లో రు. 691 లక్షలు చూపించారు. 1958-59 వచ్చేసరికి రు. 356 లక్షలు చూపించారు. పారిశ్రామిక అభివృద్ధిక్రింద 1957-58 లో రు. 190 లక్షలు చూపిస్తే యీ ఏడు రు. 147 లక్షలే చూపించారు. వ్యవసాయ అభివృద్ధికి గత సం॥రం రు. 58 లక్షలు చూపిస్తే ఈ యేడు రు. 49 లక్షలే చూపించారు. ప్రజారోగ్య అభివృద్ధి క్రింద గత సాలు రు. 30 లక్షలు కేటాయిస్తే ఈ యేడు రు. 20 లక్షలే కేటాయించారు. ఆ సంవత్సరానికి ఆ సంవత్సరం ఏదైనా అభివృద్ధి కార్యక్రమం చేయవలసింది పోయి, ఖర్చు తగ్గించి ఏమీ చేయలేని పరిస్థితిలో వున్నాము కాబట్టి, దీనికి కారణమేమిటో తెలిసికోవాలి, ఈ అసమర్థత గవర్నమెంటుదా లేక Department లో వుందో లేక Subordinates లో వుందో తేల్చుకుని, అన్ని రంగాలలోను ప్రజలకు సహాయం చేయవలసిందిగా కోరుతున్నాను. కొందరు సభ్యులు చెప్పినట్లు యిది కాంగ్రెస్ ప్రభుత్వమైనప్పటికీ కూడ ముఖా

రాజకీయాలలో మన వ్యవహారాలు జరుగుతున్నాయి. రాజమండ్రి గోదావరి గట్టు వెడల్పుచేసే Scheme ఏడు సం॥రాల క్రితం ప్రారంభమైనది. కర్నూలులో వుండగా Sanction అయితే యిప్పటికి Technical sanction వచ్చింది. సుమారు రు. 80 వేల పనిని Tenders కూడా పిలవకుండా మా మున్సిపాలిటీకి Department ద్వారా చేయడానికి ఈ రోజున ఎందుకు అనుమతించారని పరిపాలన శాఖా మంత్రిని అడిగితే, urgent గా చేయవలసి ఆ విధంగా చేశామంటున్నారు. ఏడు సంవత్సరాలనుంచీ తొందరలేని ఈ పనిని ఒకనెల రోజుల్లోనో లేక మూడు వారాల్లోనో పూర్తి చేయాలని చెప్పి Tenders కూడా పిలవకుండా ఈరోజున ఒక పార్టీని వారికి కావలసిన వారిని మాత్రం nomination చేయించి ఈ పని వారికి యిచ్చారంటే యింకో కారణం నాకేమీ కనిపించడం లేదు ఇటువంటి నెపోటిజం ఈ నాడు బాగా వుంది. ఇంతకంటె Law and order లోను judiciaryలోను కూడా ఈ రాజకీయ వత్తిడిని తీసుకువచ్చి చాలా అన్యాయాలను సాగిస్తున్నారు, I am compelled to say like that. Kurnool లో వుండగా రాయలసీమలో హత్యలు ఎక్కువ జరుగుతున్నాయని చెప్పేవారు. అందులో ముఖ్యంగా Kurnool జిల్లాలో Additional Judge, District Judge యిద్దరు వుండగా ఒకకేసుకోసం యింకో Special Judge ని, ఒక Special Public prosecutor ను కూడా వేయటం జరిగింది...

*Sri E. Ayyapu Reddy (Nandikotkur - General)*:—Now, there are three Courts functioning in Kurnool District. Any speech on or reference in respect of the third Court which is still functioning will be *Sub-Judice*, because it will be hearing the cases which are pending before it. Moreover, I may point out that Adoni and Alur have been added to Kurnool District with the result that the area of operations, the number of cases and the number of witnesses to be examined have increased. The District Judge himself reported to the High Court that an Additional Judge was necassary. It is the High Court that sanctions the establishment of the Additional Court and not the Government. Let not Hon'ble Member Dr. Nageswara Rao be under the impression that Government have appointed the Additional Judge. It is wrong to say that the Additional Court is constituted for a particular case. It is the Principal Judge that transfers the cases to the Court and not the Government; Government have no power to transfer the cases to another Court.

*Dr. A. B. Nageswara Rao*:—I am sorry. Though I am not a lawyer, I know something of law. I am not going into the merits of the case and it is, therefore, not *Sub-Judice* Hon'ble Member Sri Ayyapu Reddy must know that.

*Sri S. Ranganatha Mudaliar (Ramakrishnarajupeta)*:— Madam, Chairman, the other Hon'ble Member has addressed the Chair as "అధ్యక్షిణి" and Sri Ayyapu Reddy has addressed the Chair in some other form. For people like us, let there be some uniform address ......

*Dr. A. B. Nageswara Rao*:-"అధ్యక్షిణి" is the feminine gender of "అధ్యక్ష"

*Sri S. Ranganatha Mudaliar*:— "అక్షిణి" is the feminine gender of "అక్ష"... (Laughter)

*Mr. Chairman*:— I suggest that the hon. Member may kindly learn Telugu (Laughter).

*Sri T. V. Raghavulu (Kovvur-Reserved)*:—When a Lady Member is in the Chair, she should be addressed as Madam,Chaiaman

*Mr. Chairman*:— "అధ్యక్షిణి" is correct.

*శ్రీ ఇ. అయ్యపురెడ్డి:- అధ్యక్షిణి! సర్వసాధారణంగా నూతన సంవత్సరం వచ్చేటప్పటికి, ప్రతి రాష్ట్రములోనూ ఆర్థిక మంత్రులు ఈ Budget లను ప్రసవిస్తూ ఉంటారు. మన ఆర్థిక మంత్రిగారికి ఇది ఎనిమిదవ ప్రసవము. ఇది వారి 8వ ప్రసవమని సగర్వంగా చెప్పుకొన్నారు. అష్టమ పర్యాయం ప్రసవించినా కష్టంలేకుండా ప్రసవించారు. కష్టములేకుండా ప్రసవించారనీకూడ వారు చెప్పుకొన్నారు. ఇక తొమ్మిదవసారి ప్రసవించేటప్పటికి వారు బహుశః Delhi Lok సభలో ఉంటారని ఆశిస్తున్నాను. పౌరాణికంగా, అష్టమ ప్రసవము అనేది అవతార పురుషునియొక్క జననానికి కారణం. అరిష్టాలను పోగొట్టడానికి, కష్టాలను నివారించడానికి అది కారణ భూతమైనది. ఈ Budget కూడ అటువంటిదే అవుతుందని నేను ఆశిస్తున్నాను. Budget పై వచ్చినటువంటి విమర్శలు పలువురు పలువిధములుగా చేశారు. విమర్శలన్నీ పాతవిధంగానే ఉన్నాయని చెప్పక తప్పదు. కేవలం ఒక్క సమస్య విషయంలో తప్ప. మిగతా విమర్శలన్నీ పాత పక్కిలోనే ఉన్నాయి. "ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతి ఇచ్చాను" అన్న రకంగా, ఇన్ని గొంతుకలలో నా గొంతుకను కూడ కలిపి పాడుతాను.

గత సంవత్సరం మిర్జాగాలిబ్. తత్వాన్ని ఆలాపించారు. కష్టాలు అలవాటైపోతే అదే సుఖమైపోతుందని, ఆ విధంగానే ఈ విమర్శలుకూడ వారికి అలవాటైపోయి ఉంటాయి. కనుక అవి చాల సుఖంగా. శ్రవణానందంగా వుంటాయని అనుకుంటున్నాను. పలువురు పలు విధాలుగా చెప్పారు, పలు విషయాలు చెప్పారు. గాని ఈ పన్నుల విధానాన్ని గురించి ఒక్కరూకూడ హెచ్చరించలేదే అని నాకు

దుఃఖముగా ఉన్నది. పన్నుల విధానం గురించి ఎవ్వరూ ఆలోచించరనికూడ నాకు దుఃఖంగా ఉంది. ప్రపంచంలో రెండే రెండు తెగలు ఉన్నాయని, Bengamin Desriale అనే ఆయన చెప్పాడు—ఒకరు ధనవంతులు, రెండవవారు బీదవారు అని. దానినే Pandit Nehru కూడ ప్రపంచ చరిత్ర అను తన గ్రంథములో ఉల్లేఖించారు. ఇక పోతే Marx "Exploitad, Exploiter"అని రెండు తెగలు చేశాడు. ఆవిధంగానే నా దృష్టిలోకూడ రెండు తెగలుగా కనబడుతున్నారు. ఒకడు పన్ను ఇచ్చువాడు, ఇంకొకడు పన్ను ఇవ్వనివాడు. ఈ పన్ను ఇవ్వనివాళ్ళ గోలయే ఈ ప్రజాస్వామ్యములో ఎక్కువగా ఉంటుంది.

"నొప్పింపక, తానొవ్వక పన్ను ఇవ్వక తిరుగువాడు ప్రజ్ఞుడు సుమతి", అన్నట్లు వీళ్ళగోలయే ఎక్కువగా ఉన్నది. పన్ను ఇచ్చినవారి పరితాపాన్ని చెప్పే వారు కూడ లేరు. ఈ విషయాన్ని ఎన్నోసార్లు ఆర్థిక మంత్రిగారితో ప్రస్తావించాను.

ఉదహారణకు, రాష్ట్రంలో ఉన్న Lawyers గాని, Doctors గాని, Private Contractors గాని, ఇతర వృత్తులకు సంబంధించినవారు ఎవ్వరూకూడ రాష్ట్రానికి పన్ను అంటూ ఇవ్వడంలేదు. పదే, పదే మన ప్రగడ కోటయ్యగారియొక్క ప్రత్యేకమైనటువంటి అభిమానానికి పాత్రులై ప్రభుత్వంతో పలు విధాలుగా సహాయము పొందుతున్న చేనేత పారిశ్రామికులు 10 కానులుకూడ పన్ను చెల్లించరు. వాళ్ళ తరపున "వకాలత్" పుచ్చుకొని చెప్పేవాళ్ళు చాలమంది ఉన్నారు. సంవత్సరానికి ఏలాంటి ఆదాయములేక, పంటలు పండినా, పండకపోయినా ఫలితము ఉండినా, వుంటకపోయినా, పన్ను ఇచ్చేవారు మాత్రము చాలమంది ఉన్నారు. వారికి ఏలాంటి ఫలితమూ ముట్టడంలేదు.

శ్రీ ప్రగడ కోటయ్య (చీరాల):- On a point of information Sir, అధ్యక్షా! శ్రీ అయ్యపురెడ్డిగారు, చేనేత పారిశ్రామికులు ప్రభుత్వానికి పన్ను ఏమీ ఇవ్వడంలేదని అంటున్నారు.

నూలుమీద, లక్షల రూపాయలు Sales Tax ఇస్తూ ఉన్నారు. రంగులు రసాయనాలపై దాదాపు కోటి రూపాయలవరకు ప్రభుత్వానికి Sales Tax రూపంలో చెల్లిస్తూ ఉన్నారు. చేనేత బట్టల వ్యాపారంచేసిన వారిమీద, ప్రభుత్వం Income Tax విధిస్తున్నది, ఇంకా profession Tax వగైరా చెల్లిస్తున్నారు. కనుక అట్టివారి మీది అదనంగా పన్నులువేస్తే బాధపడేవిధానం అంత సరియైనది కాదేమో Congress సభ్యులు కొంచెం ఆలోచించాలి.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి:- ఆ విధంగా చూచుకొంటే రైతు ఈ యావత్తు భారాన్ని మోస్తూ వున్నాడు. Bus లో పోవడానికి పన్ను ఇస్తున్నాడు. సినిమాకు పోయేటప్పుడు, వినోదపన్ను ఇస్తున్నాడు. Hotels కు పోయేటప్పటికి ఇంకో పన్ను ఇస్తున్నాడు. ఆదాయం ఉండినా ఉండకపోయినా, సంవత్సరానికి తనకు ఏదైనా మిగిలినా, మిగలక పోయినా, తప్పక బాధ్యతతో పన్ను ఇచ్చువారు కొందరు మాత్రమే ఉన్నారు. పన్ను ఇవ్వక తిరుగువారు చాలమంది ఉన్నారు. దీని గురించి ఇంతవరకూ ఎవ్వరూ కూడ ఆలోచించక పోవడం, చాల శోచనీయమైన విషయం. ఈ విధంగా ఇప్పటినుంచే కాదు, రెండువందల సంవత్సరాల నుంచి ఈ విధంగానే ఉన్నది. కాని పల్లెలలో చాల ఆందోళన చెలరేగుతున్నది. ఈ పన్నులు ఒకదాని తరువాత ఒకటి ఈ విధంగా నెత్తిమీద పడుతున్నవని అసంతృప్తి ఆందోళన చెలరేగుతున్నది.

ప్రభుత్వం "నొప్పింపక, తానొవ్వక, పన్నులిచ్చి తిరుగువాడు ప్రభుపుర సుమతీ," అన్నట్లుగా ఉండాలి. ఇప్పుడు వీరువేసే పన్నులు ఎంతో బాధగా ఉన్నాయి ఒకవర్గానికి ఇంత బాధలేకుండ, తెలివి తేటలు, చాకచక్యాలు ఉపయోగించి, ఈ పన్నులు వేరే విధంగ వసూలు చేసుకోవడానికి ఆలోచన చెయ్యగూడదా అని ప్రశ్నిస్తున్నాను. ఈ పన్నుల విధానంలో ముఖ్యంగా రైతాంగానికి సంబంధించినంత వరకూ, రెండు వందల సంవత్సరాలనుంచి ఏలాంటి మార్పురాలేదు. రైతుపై ప్రత్యక్షంగా పన్నులు వసూలు చెయ్యకుండా, పరోక్షంగా వసూలుచెయ్యడానికి, మార్గం ఉందా, లేదా, అని. మనవాళ్ళు కనిపెట్టకుండా ఉండడంచాల శోచనీయమైన విషయం. దానికిగాను, ఈ Budget లో మిగులు తీసి, Finance Department కు అనుబంధంగా Taxation Reaserch Department ఒకటి ఏర్పరచి, ఈ పన్నుల విధానంలో మార్పు తీసుకరావడానికి, కృషి చెయ్యాలని, మేధస్సు ఉపయోగించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. కాగా ఈ Budget లో ఉత్పన్నమైన ఒక కొత్త సమస్య ఉన్నది. అది, ఆంధ్ర—తెలంగాణా యొక్క విభేదాలను రెచ్చగొట్టటానికి జరుగుతున్న అసత్య ప్రచారము. దానికి కొన్ని వర్గాలవారి దోహదము ఉంది. ఈ Budget లో తెలంగాణా నుంచి వచ్చిన ఆదాయము మిగులుగా ఉన్నది. ఈ ఆదాయాన్ని ఆంధ్రలో ఖర్చు పెడతారని కొంతమంది మిత్రులు అపోహ పడుతున్నారు.

తెలంగాణా వెనుకబడిన ప్రాంతం. తెలంగాణమునుండి వచ్చిన మొత్తము గాక ఆంధ్రనుండి వచ్చిన మొత్తాన్ని కూడ ఖర్చు పెట్టవలెను. విద్య, వైద్య సౌకర్యాలకేమి, నీటి వనర్ల పథకాలకైతేనేమి, విద్యుచ్ఛక్తి పథకాలకేమి తెలంగాణాకే ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వవలసిఉన్నది. ఆంధ్రప్రాంతంనుండి వచ్చిన ప్రతి ఒక్క సభ్యునియొక్క, వారి అందరియొక్క ఉద్దేశ్యము ఇదే. క్యాబినెట్ లో ఉన్నవారికి పక్షపాత దృష్టి అరో

పించి "ఇది చేసినారు అది చెయ్యలేదు" అని చెప్పడానికి ఏదైనా స్థూలముగా దృష్టాంతము నిరూపించి ఉంటే సంతోషించి ఉండేవాడను. ఇదే మేము తెలంగాణా ప్రాంతమువారిని కోరేది, (Interruption) I dont want any interruption. My learned friend can give a reply in the end. అంతేగానిమాకు Additional Chief Secretary రాలేదు, ఇక్కడ ఒక ఉద్యోగస్తునికి ఉద్యోగము ఇవ్వలేదు. ఎక్కడో ప్రమోషనురాలేదు అని చెప్పడము శోచనీయమైన విషయము. ప్రభుత్వంలో ఎంతోమంది ఉద్యోగస్తులు ఉన్నారు. కొంతమందికి ప్రమోషను వచ్చినా రాకపోయినా తెలంగాణా ప్రాంతము మునిగిపోలేదు ఇకఉస్మానియావిశ్వవిద్యాలయపు వైసు-ఛాన్సలరు నియామకములో జరిగిన అసత్య ప్రచారము చాలా హృదయ విదారకముగా ఉన్నది. ఎలాంటి తెలుగురానివారు తెలుగు భాషమీదగాని తెలుగు గడ్డమీదగాని అభిమానము లేనివారు హైదరాబాదులో తిష్ఠ వేసుకొని తరతరాలుగా తెలంగాణా ప్రజలను పీల్చి పిప్పి చేస్తున్న వ్యక్తులు ఈ దినము తమ హస్తగతమైన అధికారం తొలగిపోతుందని, సడలిపోతుందని దుఃఖ ఆవేదనతో ఈ అసత్య ప్రచారమునకు, తెలంగాణా రక్షణలనే ఈ ప్రచారము లేవతీసేరని చెప్పక తప్పదు. తెలంగాణాలోనివారిని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఏర్పాటు చేసినట్లైతే హృదయ నాధకుంజ్రూ రాజ్య సభలో తెలంగాణా రక్షణ కొరకు గగ్గోలు చేసేవాడు కాదు. స్వరాజ్య పత్రికలో వ్రాసినట్లు కేరళ ప్రభుత్వమునుండి, UNESCOనుండి ఆహ్వానింపబడిన ఒక విద్యావేత్తను విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా వేస్తే దానికి యింత గగ్గోలు లేవతీయటం చాలా విచారకరమైన విషయము. అరవ భాషవారికి ఇవ్వలేదని ప్రచారము ఇంకా శోచనీయము.

శ్రీ పి. సుందరయ్య :- ఎవరు ప్రచారం చేసినారు, ఎక్కడినుండి వచ్చినది ఈ వార్త. వారు అనవసరముగా ద్వేషాలు రెచ్చగొట్టే ఉపన్యాసములు చేస్తున్నారు అని చెప్పక తప్పదు.

శ్రీ బసవ మానేయ్య .- (అంతోలు) On a point of information, Sir, ప్రతి సంవత్సరము రెండుకోట్లు తెలంగాణాకు మిగులు ఉన్నట్లైతే అయిదు సంవత్సరాల తర్వాత ఆంధ్ర తెలంగాణా పోయి ఆంధ్రప్రదేశ్‌లో గోపాలరెడ్డిగారిని పిల్లిఎత్తుకపోతుంది.

*Sri E.Ayyapu Reddy*:- I dont want any interruption from the hon. Member. He can give a reply if he gets his turn.

తెలంగాణా మిత్రులకు నేను చేసే విజ్ఞప్తి ఒకటి. తెలంగాణా అభివృద్ధికోసము, ప్రాజక్టులకోసము విద్య, వైద్య సౌకర్యాల కోసం ఆంధ్రలో ఉన్నట్లు యావత్తు మొత్తం ఖర్చు పెట్టిన మేము సంతోషిస్తాము. కాని కొందరు తమవ్యక్తిగతమైన

వర్గ గతమైన నజరానాలకు అలవాటైన కొందరు నాయకమన్యులు చేసిన ప్రచారానికి దోహదము ఇవ్వకుండా ఉండాలని కోరుతూ, నాకు ఈ అవకాశం ఇచ్చినందులకు నా కృతజ్ఞత తెలియచేస్తున్నాను.

* శ్రీ పి. సుందరయ్య:- అధ్యక్షా, నా ఉపన్యాసమును ఒక రీతిగా ఆరంభించ వలెనని అనుకున్నాను గాని అయ్యపురెడ్డిగారి ఉపన్యాసము విన్న తరువాత నా ఉప న్యాసము ఇంకొక విధముగా ప్రారంభించక తప్పిందికాదు. దేశములో తెలంగాణా ఆంధ్రప్రాంతాలను కలిపి విశాలాంధ్ర ఏర్పాటుచేయడం జరిగింది. విశాలాంధ్ర ఏర్ప డిన తరువాత వెనుకబడిన ప్రాంతాలకు తగిన రీతిగా కృషి చేస్తామని మనము, వారు కలసి హామీ ఇచ్చినాము. నిజముగా తెలంగాణావలె వెనుకబడిన ప్రాంతాలు ఆంధ్రలో ఉన్నవా? లేదా? అనేది సమస్యకాదు. నేడు విశాలాంధ్రలో మూడు కోట్ల 50 లక్షల ఆంధ్రుల కొరకు కావలసిన చర్యలు తీసుకుంటామని, ఆర్థికముగా, వైజ్ఞాని కముగా అభివృద్ధిపొందడానికి వారికి ఉన్న అనుమానములను తీర్చడానికి హామీలు ఇచ్చినాము, వాటిని అమలు జరుపుచున్నాము. ఈ విషయములో ప్రతిఒక్కరూ జాగ్రత్తగా ఉండవలెను. ఒక్క తెలంగాణావారి విషయమే కాదు. ఇతర ప్రాంతాలవారు గోల పెట్టిన తరువాత ఆంధ్ర శాసన సభ్యులు ఆలోచించవలసిన సమస్య కాదు. ప్రతి ఒకరు ఈ విషయము జాగ్రత్తగా ఆలోచించవలెను. ఆ విధముగా ఆలోచించక అయ్యపురెడ్డిగారి ఉపన్యాసము ఇక్కడ ఎవరో తరతరాలుగా ఉంచి తిష్ఠ వేసుకొని తమ హక్కుల కోసము ఏడుస్తున్నారని అన్నట్లు ఉన్నది. అటువంటి మాటలు మాట్లా డుతూ ఉంటే మన సమస్యలు ఏవిధముగా పరిష్కారము అవుతవో తెలి యదు. అసలు విషయాలు ఆయన సమగ్రముగా అవగాహన చేసి కొన్నారో లేదో తెలియదు. అటువంటి ఉపన్యాసములు చెయ్యవద్దని వివిధ పార్టీలవారికి విజ్ఞప్తి చేస్తు న్నాను.

డి. ఎస్. రెడ్డిగారి గురించి ఇదివరకు చర్చించినాము. దానిని గురించి మళ్ళీ చర్చించాలంటే 3 కోట్ల 50 లక్షల మంది చర్చించవచ్చును. కాని ఈ సందర్భ ములో డి. ఎస్. రెడ్డి గారిని నియమించడము మంచిదా కాదా అన్న విషయాన్ని లేవ గొట్టడం న్యాయం కాదు. మంత్రివర్గం కొన్ని హామీలు ఇచ్చింది. కొంతమంది మంత్రులు రెండు హామీలు ఇచ్చారు. ఆ విషయము పత్రికలలో చదివాము. ఆ సమస్యను పరిష్కరించుకున్నామని అనుకున్నాము. ఈ వాద ప్రతివాదాలలో ఒక దొరస్వామి గారిని పెట్టలేదని గాని డి. ఎస్. రెడ్డి పనికిమాలినవారు కాబట్టి పెట్టకూడదనిగాని సమస్య కాదు. మంత్రివర్గంవారు ఇచ్చిన హామీ ఒకటి ఉన్నది. ఈ అకడమిక్ సంవత్సరం పూర్తిఅయ్యే లోపున ఉస్మానియా విశ్వవిద్యాలయ చట్టము సవరణచేసి మిగతా విశ్వవిద్యాలయాల మాదిరిగా సవరించి దాని ప్రకారం ఎన్నికలు జరుపుతామని మంత్రులుఇచ్చిన హామీఉన్నది. ఈనాడు మనము మార్చిమాసములో

ఉన్నాము. ఆ హామీ నిలబెట్టుకునే సమయంవచ్చింది. అలాంటప్పుడు ఏదో అరవవారిని పోటీపెట్టడం అనేది ఆంధ్ర తెలంగాణా భేదములు చాలక ఆంధ్ర తమిళ భేదములు తెచ్చడము మాత్రము అవుతుందని చెప్పవలసిఉన్నది. మంత్రులు, శాసనసభ్యులు కూడా ఒక విషయము ఆలోచించవలెను. ఎవరైన తెలంగాణా విషయములో తగినంత శ్రద్ధ చూపలేదు అన్నప్పుడు గోపాలరెడ్డిగారు చెప్పినట్లు ఇంతకుముందు మంత్రివర్గము ఈ మాత్రమైనా ఖర్చుపెట్టిందా ? అనే సమాధానము మళ్ళీ ఈ రోజు దయచేసి ఇవ్వవద్దని ప్రార్థిస్తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- ఇవ్వవద్దని చెప్పడానికి వారు ఎవరు.

శ్రీ పి. సుందరయ్య :- నేను చెప్పినంత మాత్రమున చెప్పరు అని నేను అనుకొనడములేదు. ఉన్నపరిస్థితిని చెడగొట్టడానికి ఇష్టమువచ్చినట్లు ఉపన్యాసము చేయడము తగిన సమాధానముకాదని అలాంటి ఉపన్యాసములు నిరుపయోగములు అని చెపుతున్నాను. ఆంధ్రుల ఐకమత్యాన్ని నాశనముచెయ్యడానికి మీ ఇష్టము వచ్చిన ఉపన్యాసములు చెయ్యవచ్చును. ఈ సమాధానము మనము ఇచ్చిన హామీలకు సమాధానము కాదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :-Inherent difficulties అని చెబితే సంతోషమే.

శ్రీ పి. సుందరయ్య :-ఇంతకు మంత్రివర్గం ఏమీ చెయ్యలేదని చెప్పడము ఆ సమస్యను పరిష్కరించే మార్గము కాదు. సమస్యను మరింత జటిలం చేస్తుంది అని చెపుతున్నాను. ఆంధ్ర ప్రజల ఐకమత్యాన్ని చెడగొడుతుందని చెప్పక తప్పదు.

ఎందుకు యీ డబ్బును ఖర్చుచేయలేకపోయారు; అడ్డంకులేవి ? 1956-57వ సంవత్సరములో 5 నెలలలో కోటి 70 లక్షలు తెలంగాణానుంచి అదనపు ఆదాయము వచ్చింది. 1957-58 రివైజుడు బడ్జట్ ప్రకారం కూడా మూడు కోట్ల అదనపు ఆదాయంఉంది. తెలంగాణా అభివృద్ధికొరకు ఎందుకు ఖర్చుపెట్టలేకపోయింది ప్రభుత్వము అని అడుగుచున్నాను. ఏకారణాలు చెపుతారోనని నేను కూడా వినదలచుకున్నాను. 470 లక్షల రూపాయలు తెలంగాణాలో 1½ సంవత్సరాలకు వచ్చిన అదనపు ఆదాయాన్ని తెలంగాణా అభివృద్ధి కార్యక్రమాలకోసము ఎందుకు ఖర్చు చేయలేకపోయాము ? దానిలోవున్న చిక్కులేమిటి. రాబోయే సంవత్సరానికి అదనంగా వచ్చే ఆదాయము 2 కోట్ల 50 లక్షల రూపాయలు, 2½ సంవత్సరాలలో 7½ కోట్ల రూపాయలు తెలంగాణానుంచి వచ్చిన అదనపు ఆదాయాన్ని తెలంగాణా అభివృద్ధికొరకు ఖర్చుపెట్టుతామని చెప్పిన తర్వాత ఎందుకు ఖర్చుపెట్టలేదని నేను అడుగుతున్నాను. వెనుకబడిన ప్రాంతాలన్ని ముందున్న ప్రాంతా

లతో సమానంగా తీసుకపోవడానికి మేము ఖర్చుపెట్టుతామన్నప్పుడు ఎందుకు ఖర్చు చేయలేదు? అది ఉద్యోగులతప్పు కావచ్చును. ప్రభుత్వ యంత్రంలో వున్న తప్పు కావచ్చును ఏ కారణంచేతనైనా కాని ఎందుకు ఖర్చుపెట్టలేక పోతున్నామనేది మంత్రివర్గము మేము అందరముకూడా లోతుకువెళ్లి ఆలోచించవలసిన అవసరముంది. ఈ 7½ కోట్ల రూపాయలను 5 సంవత్సరములైన తర్వాత ఖర్చుపెట్టుదాములే, 10 సంవత్సరములైన తర్వాత ఖర్చుపెట్టుదాములే అనుకుంటే మాత్రము వెనుకబడిన ప్రాంతాన్ని ముందుకు తీసుకువెళ్లడానికి వీలుండదు. అంతేకాదు యీ సందర్భములోనే తెలంగాణా సమస్యలన్నీ చర్చించే దాని కొరకు తెలంగాణా రీజినల్ కమిటీ కాన్స్టిట్యూషన్ ప్రకారం రాబోతూ వున్నది. ఈ 105 మందిలో తెలంగాణా సభ్యులే వుంటారు. ఈ 105 మందిలోనే యీ సమస్య లన్నిటిని చర్చిస్తామంటే వాటికి పరిష్కార మార్గము రాదు. ఇపుడు అయ్యపురెడ్డిగారు మాట్లాడినట్లు కొంతమంది మాట్లాడవచ్చును. నేను మాట్లాడినట్లు ఇంకొకరు మాట్లాడవచ్చును. లేకపోతే గోపాలరెడ్డిగారు మాట్లాడినట్లు మాట్లాడుతూ ఉండవచ్చును. తెలంగాణా 105 మంది నుంచి 9 మందితోనో 11 మందితోనో అన్ని పార్టీలతో బాధ్యతతోకూడిన ఒక చిన్న కమిటీని ఏర్పాటుచేసిన వచ్చే సమస్యలన్నిటిని కూడా వారు ఆలోచించి తగిన సలహాలు యివ్వడానికి వీలుంటుంది. అన్ని పార్టీలతో బాధ్యతతో కూడిన కమిటీని ఏర్పాటుచేస్తే ఆంధ్ర తెలంగాణా అనేటటువంటి భేదాభిప్రాయాలు రాకుండా అందరు కలసి పనిచేయటానికి అవకాశముంటుంది. అన్ని పార్టీలనుంచి తీసికోవలసి వుంటుంది. ఈ సూచనను జాగ్రత్తగా ఆలోచించమని మాత్రమే నేను మంత్రివర్గాన్ని కోరుతున్నాను. ఇక ఈ ఉద్యోగుల సమస్య వస్తుంది. దానిలో ఏమీ లేదని మంత్రివర్గము అనుకోవచ్చును. ఏదో ఒక గ్రూపు రెచ్చగొట్టుతున్నారని, ఆంధ్ర తెలంగాణా భేదాలు రెచ్చగొట్టేవానికి ప్రయత్నము చేస్తున్నారని అనుకోవచ్చును. నేను పూర్తిగా ఏమీలేదని అనుకోవడములేదు. నా దగ్గరకు ఆంధ్రప్రాంతమునుంచి వచ్చిన ఆఫీసర్లు వచ్చి మాకు అన్యాయాలు జరుగుతున్నాయని చెప్పడము, తెలంగాణా ఆఫీసర్లు మాకు అన్యాయాలు జరుగుతున్నాయని చెప్పడము జరుగుతోంది. మన ఆంధ్రదేశాభివృద్ధికి తగిన విధానము మనము తీసుకోకపోతే యీ పరిస్థితులు విషమించేదానికి కారణమౌతుంది. 9 మందితో అన్ని పార్టీల బాధ్యత కలిగినటువంటి ఒక చిన్న కమిటీని వేసి విచారించినట్లయితే కనీసము యీ భావము మన విశాలాంధ్ర ప్రజానీకములో రాకుండా సమస్యలను ఎప్పటి కప్పుడు పరిష్కరించడానికి తోడ్పడుతుంది. దీనిని జాగ్రత్తగా ఆలోచించాలనే విషయము చెప్పక తప్పదు. తెలంగాణా ప్రాంతము చాలా వెనుకబడిన ప్రాంతము. ఆంధ్రప్రాంతములోకూడా వెనుకబడిన ప్రదేశాలున్నాయి. వాటి అభివృద్ధికోసము ప్రభుత్వము తగిన రీతిగా కృషిచేయడము లేదనే సంగతికూడా ఉంది. ఈ సందర్భములో నేను ఒకటి చెపుతున్నాను. ము రోజు లెక్కలు పూర్తిగా మా దగ్గరలేవు. బడ్జెటులో యిచ్చిన లెక్కలు సరిపోవు.

ఆంధ్ర, తెలంగాణా వ్యయమును చూచుకొన్నపుడు— మెడిసిన్ విషయము గురించి ఆంధ్రప్రాంతములో 150 లక్షలు ఖర్చుపెట్టినామంటే తెలంగాణాప్రాంతంలో 152 లక్షల రూపాయలు ఖర్చు పెట్టుతూ వున్నట్లుగా బడ్జెటు లెక్కలు చూపుతున్నాయి. మొదట చూచినపుడు నాకు ఆశ్చర్యము కలిగినది. తర్వాత ఆలోచించితే హైదరాబాద్ నగరంలో వైద్యానికి ఖర్చుపెట్టినదికూడా దానిలో ఉంది. హైదరాబాద్‌లో ఖర్చుపెట్టవచ్చును. హైదరాబాద్ మన రాజధాని. అందుచేత ఇక్కడ ఎక్కువ సౌకర్యాలు కలుగజేయవలసి యున్నది. కాని దానిని తెలంగాణా వ్యయంగా చూపడము అనేది న్యాయము కాదు. "హైదరాబాదునుంచి వచ్చే ఆదాయముకూడా తెలంగాణాలో చూపుతున్నాము కదా, ఖర్చుకూడా దానిక్రిందనే ఎందుకు చూపకూడదు" అని చెప్పవచ్చును. నేను చేసే సూచన ఏమిటంటే హైదరాబాదు సిటీయొక్క ఆదాయాన్ని, వ్యయాన్ని రెంటినికూడా అటు ఆంధ్రప్రాంతములో కలుపవద్దు, ఇటు తెలంగాణా ప్రాంతములో కలపవద్దు. దానిని వేరే అటులనే చూపాలి. మిగిలిన ఆంధ్రప్రాంతానికి వచ్చే ఆదాయము లెక్కవేయండి. మిగిలిన తెలంగాణా ప్రాంతానికి వచ్చే ఆదాయము లెక్కవేయండి. వచ్చే ఆదాయంప్రకారం ఎంత ఖర్చు పెట్టుతామో చూడండి. తెలంగాణాలో వచ్చిన ఆదాయాన్ని అంతా ఇక్కడనే ఖర్చుపెట్టితే సరిపోతుంది అనుకొనే వాడిని కాను. ఎక్కడ ఎక్కువగా వెనుకబడినప్రాంతము వుంటుందో అక్కడనుంచి వచ్చిన ఆదాయానికన్నా ఇంకా అదనంగా ఖర్చు పెట్టి దానిని సాధ్యమైనంత త్వరగా అభివృద్ధి జెందిన ప్రాంతాలతోపాటు ముందుకు తీసికొని వచ్చినపుడే విశాలాంధ్రలో అర్థము ఉంది. లేకపోతే అభివృద్ధి చెందిన ప్రాంతాలు, అభివృద్ధి చెందిన వ్యక్తులు, వెనుకబడిన ప్రాంతాలవారిని అణచడానికి పెత్తనము చేసేరీతిగా మన పరిపాలనావిధానము సాగడము జరుగుతుంది. అందుచేత యీ విషయములో ఇంకా లోతుగా వెళ్ళవలసి వుంటుంది. ఈ బడ్జట్ మెమొరాండమ్‌లో ఏవైన ఎక్కువ మార్పులు జరిగితే ఎక్కువ వివరాలు యిచ్చేదానికోసము ఉద్దేశింపబడినది. కాని యీ బడ్జట్ మెమొరాండమ్‌లో ఎంత లోతుగా చూచినప్పటికి కూడా ఏమీలేదు. ఏఏ పద్దులు ఎక్కడ కూడ వున్నాయో ఒక పర్యాయము చెప్పితే చాలు. మార్పులకు కారణాలేమిటో చెప్పాలి. ఈ రోజు విద్యా, మెడిసిన్, పబ్లిక్ హెల్తు, పరిశ్రమలు—వీటినన్నిటిని గురించి పరిశీలించినపుడు మొదటి బడ్జట్‌కు రివైజ్‌డు బడ్జట్‌కు తేడా కనపడుతుంది. దీనికి కారణాలు వివరించలేదు. ఏదో ఒకచోట మాత్రము ఇదివరకు ఆయా పద్దులక్రింద ఇండియా గవర్నమెంటు యిచ్చే డబ్బు అంతాకూడ దానిలో జమ కట్టేవాండ్లము. ఇపుడు ఆ రకంగా జమకట్టకుండా, ఇండియా గవర్నమెంటు నుంచి వచ్చే డబ్బు ఎంతో వేరే చూపిస్తున్నామని చెప్పారు. కాని రికవరీస్‌కు, గవర్నమెంటు యిచ్చే గ్రాంట్సుకు, మిగిలిన డబ్బుకు యీమూలనుంచి ఆమూలకు 7 వందల పేజీలు తిరుగవేసినాకూడా అతుకులు కుదరడంలేదు. దానిలో డిస్‌క్రిపెన్‌సీస్ వున్నాయి. ఫైనాన్సు డిపార్టుమెంటులో అవక

తపికలు వుండవచ్చును. కాని బడ్జెట్టును శాసనసభ్యుల ముందు పెట్టడమువల్ల దానిని చదివి కొన్ని నిర్ణయాలకు వచ్చేదానికి సూచనలు చేయడానికి వీలుగా వుండాలి. పరిశ్రమలనుంచి దాదాపు 70 లక్షల రూపాయలు తెలంగాణా నుంచి ఆదాయము వస్తుంది. కాని 30 లక్షల రూపాయలు మాత్రమే వస్తుందంటున్నారు. ఎందుకుగాను తగ్గిపోయింది దానికి కారణ మేమిటి? ఇది సెంట్రల్ గవర్నమెంటు గ్రాంటు సమస్యకాదు దానికి వివరము ఉందా అంటే, ఎక్కడా లేదు. బడ్జెట్టు మెమొరాండములో శాసన సభ్యులకు ఎక్కువ విషయాలు తెలియజేసే దానికి బదులు సమస్యను మరింత జటిలము చేయడం జరిగింది. యీ విషయమును గురించి నేను గత మూడు సంవత్సరములుగా ప్రభుత్వాన్ని అడుగుతున్నానుగాని ఎట్టి చర్యా తీసుకొనుట లేదు. బడ్జటును సమగ్రంగా చర్చించవలెనంటే లెక్కలపద్దులు చూపించినంత మాత్రమున సరిపోదు. మనము ఖర్చు పెడుతున్న డబ్బుకు అనుగుణంగా ఆర్థికాభివృద్ధి జరిగినదా? విద్యాభివృద్ధి జరిగినదా తదితర రంగాలలో రాష్ట్రము అభివృద్ధి చెందినదా అనే విషయములను గురించి స్థూలంగా తెలుసుకోవలసి ఉంది. ఇంత ఆదాయము వచ్చింది, ఇంత ఖర్చు పెట్టాము, తెలంగాణాకింత ఆంధ్రకింత అని చెప్పినంత మాత్రాన సరిపోదు. ఇన్ని కోట్ల రూపాయల ఖర్చు పెట్టినందువల్ల సాధించిన ఫలితములేమో తెలియజేయాలి. అదే మనకు గీటురాయి. ఇదివరకు ఇటువంటి వివరాలు కొద్దిగా అయినప్పటికీ బడ్జటులో ఉండేవికాని గోపాలరెడ్డిగారు కొత్త పోకడలు ప్రారంభించారు. కేవలము లెక్కలు చూపించినంత మాత్రాన బోధపడదు. మనము ఖర్చుపెట్టిన మొత్తములకు మనము సాధించిన ప్రయోజనాలేమో ప్రజలకు తెలియచేయవలసిన అవసరమున్నది. అట్టి వివరములు లేనిచో గోపాలరెడ్డిగారి ఉపన్యాసమక్కర్లేదు. ఇటువంటి బడ్జటు ఉపన్యాసములు నిరుపయోగమవుతాయి. శ్రీ గోపాలరెడ్డిగారు వివరములు తెలియజేయక పోయినా మేమయినా వాటిని తెలుసుకొనుటకు ప్రయత్నిద్దామనుకొన్నప్పటికి రిపోర్టులు లేవు. దొరికినంత వరకూ కొన్ని సందర్భములలో 1954-55 రిపోర్టులను కొన్నిటిని 1955-56 రిపోర్టులను కొన్నిటిని మాత్రమే పరిశీలింప గలుగుతున్నాము. ఇపుడు మనము 1958వ సంవత్సరములో నున్నాము. 1956 సంవత్సరములోగాని 1957 సంవత్సరములోగాని మనము సాధించిన ఫలితములేవో మనము తెలుసుకొనకుండా యీ బడ్జటును విమర్శించడము కష్టము. పరిపాలనకు సంబంధించిన నివేదికలు లేకుండా యీ బడ్జటు పై అభిప్రాయములు తెలుపడము కష్టముగా ఉంటుంది. కేవలం స్థానికంగా ఉన్న కష్టసుఖాలను చెప్పుకోవడము తప్ప యీ బడ్జటును జాగ్రత్తగా పరిశీలించడానికి వీలు లేకుండా ఉన్నది. సూచనలు చేయడానికి వీలులేకుండా ఉన్నది. బడ్జటులో చూపించే స్కీములు వేరు, అమలు జరిపే స్కీములు వేరు. ఇటువంటి పరిస్థితులలో యీ బడ్జటును శాసనసభ ఆమోదించడము కేవలము బూటకముక్రింద, నాటకముక్రింద తయారవుతున్నదే తప్ప శాసనసభకు ఇవ్వవలసిన గౌరవము ఇస్తున్నట్లు

కనపడడములేదు. శాసనసభ ఆమోదము పొందిన తరువాత తమ ఇష్టమువచ్చిన వారికి కొంత డబ్బు ఖర్చు పెట్టడము సరిఅయినదికాదు. 1953-54 లోని 6 నెలలకు సంబంధించిన లెక్కలను గమనించి నట్లయితే శాసనసభ ఆమోదించిన 688 ఐటము లలో ప్రభుత్వము రీయెపాప్రిప్రియేషను అను పేరుతో తన ఇష్టమువచ్చినట్లు కొన్ని ఐటములను తగ్గించడము కొన్నిటిని చేర్చడము జరిగినట్లు అనిపిస్తుంది. పూర్తి వివరాలు లేకపోయినా 1957-58 సంవత్సరపు రివైజ్‌డు బడ్జటును చూచినట్లయితే సివిల్‌వర్కుక్రింద మొట్టమొదట చూపిన 155 ఐటములలో 103 ఐటమ్సుమీద ఒక దమ్మిడీకూడ ఖర్చుపెట్టలేదు. 52 ఐటమ్సు విషయంలో నూటికి 25 నుంచి 50 వంతులవరకూ మాత్రమే డబ్బు ఖర్చు పెట్టగలిగింది. క్రొత్తగా 128 ఐటమ్సును అమలు జరపడం జరిగింది. 25 ఐటమ్సుమీద బడ్జటులో చూపించిన దానికన్నా రెండు మూడు రెట్లు అదనంగా ఖర్చుచేయడం జరిగింది, ఇరిగేషన్ పద్దుక్రింద 12 ఐటమ్సుఉన్నాయి. 3 ఐటమ్సుమీద నూటికి 25 నుంచి 50 వంతులవరకూ ఖర్చు ఖర్చుపెట్టారు. 19 క్రొత్త ఐటమ్సు తీసుకున్నారు. 5 ఐటమ్సుమీద రెండురెట్లు, 3 రెట్లు ఖర్చుపెట్టారు. ఎలెక్ట్రిసిటీ పద్దులక్రింద ఉన్న ఐటమ్సులో 3 ఐటములమీద ఖర్చు చేయలేదు. 5 ఐటముల మీద నూటికి 25 వంతులనుంచి 50 వంతులవరకూ మాత్రమే పెట్టారు, 31 క్రొత్త ఐటమ్సు తీసుకొన్నారు. 9 ఐటమ్సుమీద బడ్జటులో ఆమో దించినదానికన్న రెండు మూడు రెట్లు ఖర్చుచేశారు. ఈ విధంగా చేస్తున్నప్పుడు శాసనసభ ఆమోదానికి అర్థమేమిటి? ఇరిగేషన్ పద్దుక్రింద 16 కోట్ల రూపాయలు శాసనసభ ఆమోదించింది కాబట్టి మేము మా యిష్టంవచ్చినట్లుగా ఆ మొత్తా న్ని ఖర్చు చేస్తామనడం సబబుకాదు. విద్యుచ్ఛక్తి పద్దుక్రింద ఏడు కోట్లు ఇచ్చారు కనుక మా యిష్టంవచ్చిన స్కీములకుగాను ఆ డబ్బు ఖర్చు పెడతామంటె సబబు కాదు. అదేవిధంగా సివిలు వర్క్సు నిమిత్తం యిచ్చిన 7 కోట్లను ఏదో విధంగా ఖర్చు పెడతామన్నా న్యాయంగా లేదు. ఈ విధంగా చేసినట్లయితే యీ 700 పేజీల పుస్తకము మాకిచ్చినందువల్ల ప్రయోజనమేమీ ఉండదు. ఆ గ్రామంలో రోడ్డు వేస్తా ము, యీ గ్రామంలో స్కూలు ఏర్పాటుచేస్తాం యీ గ్రామంలో మరొక పనిచేస్తాము అని బడ్జటులో చూపినప్పటికి ఆచరణలో ఆ పనులు జరుగక పోయినట్లయితే యీ పుస్తకం ఇచ్చి ప్రయోజనం లేదు ఇది శాసన సభను సీరియస్‌గా తీసుకోవడం కాదు. శాసనసభయొక్క మర్యాదనుగాని, ప్రజాతంత్రాన్నిగాని కాపాడే పద్ధతి కాదిది. ముందుగనే ఈ సంవత్సరంలో ఏయే స్కీములను అమలు చేయగలమని ఆలోచించి వాటినే బడ్జటులో చూపించి వాటి నిమిత్తమే డబ్బు ఖర్చు చేయాలి గాని ఇష్టంవచ్చినట్లు డబ్బు ఖర్చుచేయడం న్యాయంకాదు. ఐతే కొన్నిపనులను అను కున్నంత తొందరగా పూర్తిచేయలేక పోవచ్చు. కొన్నిటికి ఎక్కువ డబ్బు కావలసి రావచ్చు. కొన్ని క్రొత్తవికూడ తీసుకోవలసి రావచ్చును. అటువంటివాటికి సప్లి మెంటరి డిమాండ్సును తీసుకుని రావాలి. ఆ విధంగా కాకుండా ఉద్యోగుల- వ్యక్తుల

పలుకుబడులను బట్టి క్రొత్త స్కీములను తీసుకోడం, కొన్ని పాత స్కీములను వదలడం సబబు కాదు. బడ్జెట్ పాస్ చేసిన తరువాత 9 నెలలకుగాని ఫైనాన్సువారు ఎప్రోప్రియేషను చేయరు. ఏ నవంబరు, డిశంబరులోనో ఎప్రోప్రియేషన్సు జరిగినా ఆఖరు 3, 4 నెలల్లో ఆ మొత్తాన్నంతా ఉద్యోగులు ఖర్చు పెట్టడం కష్టం. అందువలననే ఎంతో మొత్తం ఖర్చుకాకుండా ఉండటం జరుగుతున్నది. 3, 4 నెలల్లో తొందరగా పనులు చేయవలసిఉండినందువల్ల తగినంత సాంకేతిక సిబ్బందిలేని కారణంచేత శాంక్షనయిన మొత్తాలు ఖర్చు కాకుండా మిగులుతున్నాయి. ఈ విషయాలనే గోపాలరెడ్డిగారు చెప్పవచ్చు. మార్చి నెలాఖరుకు మనం బడ్జటును పాస్ చేస్తున్నాం. ఇంతకు ముందు 6 నెలలు ఎస్టిమేట్సును తయారు చేయడానికి ఫైనాన్సువారు ప్రయత్నిస్తారు. యీ విధంగా తయారు చేసిన మొత్తములనే ఫైసలు ఎప్రోప్రియేషన్సుగా తీసుకోవాలి. వాటికి శాసనసభ ఆమోదమును పొంది ఆ డబ్బును అనుకున్న స్కీములకు ఖర్చు చేయడం చాల మంచిది. మొన్న బ్రహ్మానందరెడ్డిగారు మాట్లాడుతూ మేము కలక్టరుగారికి పంపిన పిటిషను వారికి అందకపోయి ఉండవచ్చుని కాబట్టి మంత్రిగారికి సరాసరి వ్రాస్తే చర్య తీసుకుంటారన్నారు. మా పార్టీ సభ్యులు ఎన్ని జాబులు వ్రాశారో నావద్ద లెక్కలు లేవు. కాని మా లెజిస్లేచరు పార్టీ ఆఫీసునుంచి నేనుగాని, శ్రీ నారాయణరెడ్డిగారుగాని, శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారుగాని మంత్రులకు ఆయా కార్యదర్శులకు, 64 జాబులు వ్రాశాము. వాటిలో 14 జాబులకు మాత్రం ఏ చర్య తీసుకున్నది—అనుకూలంగా కానివ్వండి—ప్రతికూలంగా కానివ్వండి—మాకు జవాబు రావడం జరిగింది. 8 విషయాల్లో ఫార్మల్ ఎక్నాలెడ్జిమెంటు మాత్రం వచ్చింది. మిగిలిన 42 జాబులకు అతి, గతిలేదు. గత జూను నుంచి యీ ఫిబ్రవరిదాకా జరిగినవి ఇవి. ఈ రకంగా శాసన సభ్యులకు విలువ ఇస్తూంటే ప్రజాతంత్రం యే విధంగా కొనసాగుతుందో తెలియడంలేదు. సభ్యులను గురించి మంత్రులకు ఎటువంటి గౌరవమున్నదో అనేదానికి ఇది నిదర్శనము. 3, 4 నెలల కొకసారి ఏ 15, 20 రోజులో సమావేశమయి సభ్యులు ఏవో ఉపన్యాసా లిస్తారుకదా అని భావించడం సబబు కాదు. ప్రజా ప్రతినిధులుగా ఈ సభకు ఎన్నికయినవారికి ఈ మంత్రులు ఏ విధంగాను గౌరవమివ్వరు. మేము అనేక ప్రశ్నలు పంపుతాము. అనేక తీర్మానాలిస్తూంటాము. అనేక కట్ మోషనులు ప్రతిపాదిస్తూంటాము. బాధ్యతగల సభ్యులు శాసనసభలో చేసే సూచనలను విమర్శనలను విచారించి ఏ రకమయిన చర్య తీసుకున్నది మాకు తెలపాలి. మేమిచ్చిన సూచనల్లో లోపాలున్నావా? లేక సవ్యంగా ఉన్నవా? అని పరిశీలించాలి. అటువంటి పద్ధతిని అనుసరించనప్పుడు ఏ రకంగా ఈ మంత్రులు ప్రజా తంత్రాన్ని ఉద్ధరిస్తారో నాకు తెలియటం లేదు. ఏ 3, 4 నెలలకో ఒక పర్యాయం సమావేశమై ఈ 300 మంది సభ్యుల్లో ఏ 30, 40 మందో మాట్లాడితే వారికి ఏదో సమాధానమిచ్చిన సరిపోదు. బ్రిటిషువారున్నప్పుడు ఆయా డిపార్టుమెంటుకు శాసన సభ్య

లతో కూడిన స్టాండింగు కమిటీలుండేవి. మనమిప్పుడు ప్రజాతంత్ర యుగంలో ఉన్నాం. ప్రతి శాఖకు 10 మంది శాసన సభ్యులతో స్టాండింగు కమిటీలు ఉండాలి. ఈ సభలో ఆయా పార్టీలకున్న నిష్పత్తి ప్రకారం కమిటీలను ఏర్పరచాలి, ఆ కమిటీలు ఆయా శాఖలకు సంబంధించిన అన్ని విషయాలను పరిశీలించిన మీదట అవి చేసే నిర్ణయాలను సాధ్యమైనంతవరకు ప్రభుత్వం అమలు చేయాలి. ఆ విధంగా చేస్తే అనేక యిబ్బందులు పోతాయి. ఈనాడున్న ఆంధ్ర—తెలంగాణా విభేదాలు పోతాయి. ఐతే ఇప్పుడున్న లెజిస్లేచరు కమిటీల నివేదికలకు ఎంత విలువ యిస్తున్నాం? కనుక ఈ కమిటీలు వేయమంటారని అడగవచ్చు. ఆ ప్రశ్నకు నేను సమాధాన మివ్వలేను. మేము ఎస్టిమేట్సు కమిటీ తరపున 6 నెల్ల క్రితం రిపోర్టు పంపాము. దానిగురించి ప్రభుత్వం ఏమి చర్య తీసుకున్నది మాకు తెలియదు. అన్ని పార్టీలు ఏకగ్రీవంగా వ్రాసిన రిపోర్టది. దానిని గురించి ఏమిచర్య తీసుకున్నది మాకు తెలుపలేదు.

ఆర్థిక మంత్రిగారు ఈ బడ్జెట్టును ప్రవేశపెడుతూ, ఇది మిగులు బడ్జెటు అన్నారు. ఇది మిగులు బడ్జెటు కానేకాదు. లెక్కలలో యీ మాదిరి మిగులు చూపించ దలచుకుంటే గోపాలరెడ్డిగారు 5 యేండ్లనాడే చూపించి యుండుట వారికి కష్టమైన పనికాదు. 7 కోట్ల రూపాయలు తెలంగాణాకు అదనంగా వచ్చిన ఆదాయం తెలంగాణా అభివృద్ధికి ఖర్చుపెట్టకుండా ఉంటే, మిగులు కనపడుతూనే ఉంటుంది. అందులో బ్రహ్మాండం ఏమిఉంది? అందుచేత యిది మిగులు బడ్జటు అని చెప్పుటకు వీలులేదు. ఇందులో రెవిన్యూ అక్కౌంటు, Capital account, N. E. S. Blocks లో వివిధ స్కీములకు ఖర్చుపెట్టే డబ్బు break up చేసి, Social Welfare, విద్య, వైద్యము, వ్యవసాయం — ఆయా శీర్షికల క్రింద విభజనచేసి సివిల్ వర్కుల్లో ఏ ఏ డిపార్టుమెంట్సులో ఎంతెంత ఖర్చు పెడుతున్నారో విభజించి, (Local Boards Finances విభజించుటకు నావద్ద latest reports లేవు.) మిగిలినవన్నీ చూస్తే- గత సంవత్సరమునకు ఈ సంవత్సరమునకు ఎక్కడ ఉన్నామని చూస్తే — మనది మిగులు బడ్జెటు అనేదానికన్న — ఇది ఒక stagnated budget - మురుగుతూ ఉన్నటువంటిది తప్పితే — ఏమీలేదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే ఉన్నట్లున్నది. పంచవర్ష ప్రణాళికలు వేసి దేశాన్ని ముందుకు తీసుకుపోతున్నామనుకుంటున్నాము. జాతీయాదాయం ప్రతి సంవత్సరం నూటికి అయిదు రూపాయలు పెంపు చేసుకొంటూ ప్రజల జీవన స్థాయిని పెంపొందించుకొంటూ పోతున్నామని అనుకుంటున్నాము. కాని ఆ అభివృద్ధి యిందులో ఏమీ కనపడుటలేదు. గత సంవత్సరం బడ్జెటులో వ్యవసాయానికి నీటి పారుదల కోసము యీ రెవిన్యూ, కాపిటల్ అక్కౌంటు రెండు కాతాలక్రింద 13 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలనుకుంటే, ఈ సంవత్సరం 12½ కోట్లు ఖర్చు పెడుతున్నారు. దానిమీద Interest గురించి నేను చెప్పటంలేదు. Interest తీసేస్తే

చెబుతున్నాను. విద్యుచ్ఛక్తికి గత సంవత్సరం రు. 6,30,00,000, ఈ సంవత్సరం రు. 3,70,00,000 లు అంచనా: గత సంవత్సరం పోడ్లకు 7 కోట్లు, ఈ సంవత్సరం 6½ కోట్లు ఖర్చు చూపించారు. కాని వడ్డీల విషయంలో గత సంవత్సరం 5 కోట్ల 70 లక్షలయితే ఈ సంవత్సరం 6 కోట్ల 70 లక్షలు వడ్డీ యిచ్చుకోవాలని చూస్తున్నారు. గత సంవత్సరం విద్యమీద 13½ కోట్లయితే, ఈ సంవత్సరం 14 కోట్లే ఖర్చు. అదనంగా ఖర్చుపెట్టుతున్నది రెంపింటిలో మాత్రమే. గత సంవత్సరం వ్యవసాయం, అడవులు, పశువైద్యం, సహకారం – 6½ కోట్లు, ఈ సంవత్సరం 7½ కోట్లు ఖర్చుపెట్టబోతున్నారు. వైద్యం, ప్రజారోగ్యం – గత సంవత్సరం నాలుగు కోట్లయితే, ఈ సంవత్సరం అయిదు కోట్లు – అన్ని ఖాతాలక్రింద break up చేసిచూస్తే- ఖర్చు పెట్టుతున్నారు. మొత్తంగా గతసంవత్సరం 90 కోట్లు, ఈ సంవత్సరం 90 కోట్లు పారిశ్రామికంగా, వ్యవసాయం, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి – ఇవిచూస్తే తక్కువ ఖర్చుపెడుతున్నారు. ఎందులోనూ అభివృద్ధి నాకు గోచరం కావటంలేదు. విద్యుచ్ఛక్తిమీద గత సంవత్సరముకన్న ఈ సంవత్సరం ఒక కోటి రూపాయలు working expenses ఎక్కువ చేశారు. ఇంత ఎందుకు? ప్రతి చిన్న ఐటెమ్ – capital account లోకి తీసుకుపోతున్నారు. విద్యుచ్ఛక్తి working expenses కు అదనంగా ఖర్చుపెట్టే కోటి రూపాయలకు ఈ Memorandum లో వివరాలు యివ్వలెదు.

ఈ సంవత్సరం కొత్త పన్నులు వేయుటలేదని గోపాలరెడ్డిగారు అన్నారు. ఆ విషయం బడ్జెటు ఉపన్యాసంలో ఎక్కడైనా చెప్పారా అన్నారు. కాని నేను బడ్జెటు ఉపన్యాసం యివ్వబడినప్పుడు లేను. జనరల్ గా పబ్లిక్ లోనూ, చాలామంది శాసనసభ్యులకూ, యిందులో కొత్త పన్నులు వేస్తామనేది లేకపోవటంతో, నిజంగా పన్నుల భారం ఎక్కువకాదని ఒక అభిప్రాయం ఉన్నది. అది పొరపాటు, ఇంతకు ముందు కొత్త పన్నులకు మనము పాస్ చేసిన చట్టాలు బయటికి పోలేదు. రూల్సుకోసం, వాటికోసం, ఇక్కడ డిపార్టుమెంట్సులోనే తిరుగు తున్నాయి. అవి వచ్చి ప్రజలమీద పడినప్పుడు తెలుస్తుంది. ఇక కొత్తగా పన్నులకు బిల్సుతెస్తామా? లేదా? అనేది వేరేసంగతి. సెలెక్టు కమిటీముందు Entertainment Tax, Buidings మీద Municipalities లో సర్ చార్జి బిల్సు ఉన్నవి, అవి ఏమవుతాయో చూడాలి. ఈనాములు ఎబాలిష్ చేసి పన్నులు ఎక్కువ చేయుటవల్ల 1 కోటి 40 లక్షలు వస్తుందని అంచనా. గత సంవత్సరం 30 లక్షలు అయింది. వచ్చే సంవత్సరముకు 63 లక్షలు వసూలుచేస్తామన్నారు. మిగిలిన 80 లక్షలపన్ను వాళ్ళమీద పడవలసినదే నన్నమాట. అది వసూలుచేయటంలో ఆలస్యం అవుతున్నది. ఈ విధంగా land revenue మీద సర్ చార్జి, standardisation of land revenue, కమ్మర్షల్ క్రాప్స్ మీద పన్నులు, betterment levy మీద పన్నులు

యివన్నీ వసూలు చేయుటకు గవర్నమెంటు యంత్రాంగం గ్రామాలకు వెళ్ళేటప్పటికి — ఆరోజున ఈ పన్నులభారం గురించి (యిప్పుడు కొత్తగా పన్నులు వేయుట లేదని చెప్పినప్పటికీ) ఏమిచెబుతారో చూడాలి ఇవి గాక తెలంగాణా ప్రజలమీద stamp fees, motor vehicles taxation, entertainment tax అదనంగా పడుతున్నాయి. ఇకనుంచి వసూలు చేస్తారు. మంత్రిగారు యింకొక విషయం చెప్పారు. మనం ఈ రోజున 75 లక్షలు మిగులు చూపించుటకు కారణం — భారతప్రభుత్వం ఫైనాన్సు కమిషన్ — చాలా ఉదారంగా డబ్బుయిచ్చిందని అన్నారు. నిజమే గతసంవత్సరం సెంటరునుంచి పన్నులు 7 కోట్లు వస్తే, యీ సంవత్సరం 15 కోట్లువచ్చింది 3కోట్లు వారు excise ద్వారా వసూలుచేసి యిచ్చింది సెంటరుద్వారా యిచ్చినట్లు అనుకొనుటలేదు. Constitutionalగా యివ్వవలసిన గ్రాంట్సు కలిపితే 15 కోట్లు అని, గత సంవత్సరం కంటె 8 కోట్లు అదనంగా యిచ్చారు కదా అని చూస్తే లాభంలేదు. ఆంధ్రనుంచి పన్నులద్వారా ఎంత తీసుకుపోతున్నదీ; మన జనాభా ప్రకారం వాటా వస్తున్నదా, లేదా అని అడుగుతున్నాను. ఈ దామాషాలెక్క కట్టడానికి నా చేతుల్లో Research Department లేదు. ఆ లెక్క కోసం ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. ఆంధ్రరాష్ట్రంనుంచి కేంద్రం ఎంతపన్ను తీసుకుపోతున్నది? కేంద్రానికి వ్రాస్తే చెప్పకపోవచ్చునుగాని మనకు పండేపంటలు తెలుసు, వేసే పన్నుల రేట్లు తెలుసు. లెక్కవేస్తే ఎంతపన్ను వస్తుందీ తెలుసు. Appropriation Bill వచ్చినప్పుడు కేంద్రప్రభుత్వం మన రాష్ట్రంనుంచి ఎన్నికోట్ల రూపాయలు పన్నులు వేసి తీసుకుపోతున్నదీ, మనకు ఎంత వాటా వస్తున్నదీ లెక్కలు ఉజ్జాయింపుగా చెబుతాను. అప్పుడు ఆంధ్రదేశానికి కేంద్రం చేస్తున్న అన్యాయం స్పష్టంగా కనపడుతుంది. ఇక్కడ ఉన్న ఉజ్జాయింపు లెక్కల ప్రకారం చూస్తే 60, 70 కోట్ల రూపాయలు ఆంధ్రరాష్ట్రంనుంచి తీసుకుపోతుంటే, వారు 8 కోట్లు మనకు యిస్తున్నారన్ల చెప్పటం, వారు మనకేదో ఒరగపెడుతున్నారనుకోడం అర్థంలేని మాట. కేంద్రం తీసుకొంటున్నప్పటికీ పంచవర్ష ప్రణాళికలకు డబ్బు వాటా యిస్తున్నదికదా అంటున్నారు. ఈ విషయమై గత సంవత్సరంకూడా చెప్పాను. 7,100 కోట్లరూపాయలు ప్రభుత్వరంగంలో, ప్రైవేటు రంగంలో రెండవ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు పెడుతూంటే జనాభా దామాషా ప్రకారం మన ఆంధ్రదేశంలో 630 కోట్లు ఖర్చు పెట్టాలి. కాని ఎంత ఖర్చు పెడుతున్నారు? ప్రభుత్వ రంగంలో 175 కోట్లు, ప్రైవేటు రంగంలో 40, 50 కోట్లకంటె, ఎక్కువలేదు. రు, 630 కోట్లు ఎక్కడ, 220, 230 కోట్లు ఎక్కడ ? 3 వంతు మాత్రమే ఖర్చు పెట్టుతున్నారు. టాటాస్‌కు 10 కోట్లు వడ్డీ లేకుండా స్టీల్ ఫ్యాక్టరీ కట్టుకోమని అప్పుయిస్తున్నారు. మనకు నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు డబ్బు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, వెనకటి హైదరాబాదు ప్రభుత్వం, రెండవ పంచవర్ష ప్రణాళికలో 58 కోట్లు కావాలని కోరితే 25 కోట్లు యిచ్చి రోజూ బేరమాడుతున్నారు. ఇంకా తగ్గించుకోమంటారు, 'Core of the Plan'

అన్నదానిలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు గురించి లేదు. కేంద్రప్రభుత్వం 8 కోట్లు యిచ్చి ఏదో ఒరగపెట్టుతున్నదని సంతోషపడాలా ? ఇక్కడ ఉన్నదీ కాంగ్రెసు ప్రభుత్వమే, కేంద్రములో ఉన్నదీ కాంగ్రెసు మంత్రివర్గమే. కాబట్టి మన ప్రభుత్వం కేంద్రంవారిని "మా నాగార్జునసాగర్ ప్రాజెక్టు 10 ఏండ్లలో పూర్తికావాలి, దానికి కావలసిన డబ్బు యివ్వాలి, యీ రాష్ట్రంనుంచి యింతడబ్బు తీసుకు పోతున్నారు," అని లెక్కలు వేసి వారిని నిలబెట్టి అడుగుతున్నారా ? కమ్యూనిస్టు పార్టీమీద, ప్రతి పక్షాలమీద దాడిచేసి, ప్రతి విషయానికి క్రిందామీద పడేదానికి యీ ప్రభుత్వం గట్టిగా ప్రయత్నిస్తుందే గాని, ఆంధ్రప్రజలకోసం, కేంద్రప్రభుత్వంతో దెబ్బలాడేదానికి ఎందుకు ప్రయత్నం చేయరని అడుగుతున్నాను. బి.సి. రాయ్ గట్టిగా నిలబడి "నా రాష్ట్రానికింత డబ్బు రావాలని" కేంద్రప్రభుత్వంనుండి సహాయం తీసుకు వెళ్ళటం లేదా ? గోవిందవల్లభపంత్ "నా రాష్ట్రానికింత కావాలని" కేంద్ర ప్రభుత్వాన్ని అడిగి డబ్బు తీసుకువెళ్ళటం లేదా ? చివరకు మద్రాసు ప్రభుత్వం కూడా కేంద్రప్రభుత్వంతో పోట్లాడి, ఎరువుల ఫ్యాక్టరీని ఏర్పాటు చేసుకోలేదా ? కాని మన ప్రభుత్వం ఏమి చేసింది ? బొగ్గుదొరికే చోటనే ఎరువుల ఫ్యాక్టరీ పెట్టటానికి నిర్ణయించినపుడు, మద్రాసురాష్ట్రంలో 1960 దాకా బొగ్గు దొరకకపోయినా అక్కడ ఎరువుల ఫ్యాక్టరీ పెట్టటానికి నిర్ణయించారు. మన రాష్ట్రంలో బొగ్గు దొరుకుతుంది. కాని మనకు మాత్రం ఎరువుల ఫ్యాక్టరీ రాలేదు. కేంద్రప్రభుత్వం అటువంటి అవక తవకలు చేస్తున్నప్పుడు, మన రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంతో దెబ్బలాడిందనే అను కోమంటారా ? అని అడుగుతున్నాను. నాగార్జునసాగర్ ప్రాజెక్టు కట్టే పద్ధతిలో కూడ, మనకు కొన్ని కోట్ల రూపాయలు నష్టం వచ్చేటట్లుగా కేంద్రప్రభుత్వం ప్రయత్నిస్తోంది. పూర్తిప్రాజెక్టు తీసుకుని అమలు జరిపితే లాభకరం అయ్యేదానిని, పాడుచేసే రీతిగా కేంద్రప్రభుత్వం పని చేస్తోంది. ఈ విధంగా కేంద్రప్రభుత్వం చేస్తూంటే మన మంత్రులు ఏం చేస్తున్నారు?

శ్రీ తిమ్మారెడ్డిగారు మంత్రిహోదాలో, ధాన్యం ధరలు ఇష్టంవచ్చినట్లు పెరగ లేదని, భూ సంస్కరణలు పనికిరావని పబ్లిక్ ప్లాట్‌ఫారమ్సు మీద మాట్లాడినట్లు మాట్లాడుతున్నారు. ఇష్టంవచ్చినట్లు ధాన్యం ధరలు పెరగాలంటున్నారు. భూసంస్క రణలు పనికిరావంటున్నారు. అది వారి అభిప్రాయమైతే కావచ్చును. భూస్వాము లకు ఇంకా లాభం రావాలని, ధరలు పెరగాలని, భూసంస్కరణలు పనికిరావని పోరాడుతున్న మంత్రిగారు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు ఎక్కువడబ్బు ఖర్చుపెట్టుటలేదని కేంద్రప్రభుత్వాన్ని బహిరంగంగా ఎందుకు గదమాయించరు ? కేంద్రప్రభుత్వం కావలసిన డబ్బు ఖర్చు పెట్టటం లేదని బహిరంగ సభలలో

మంత్రులు ఎందుకు చెప్పరు? ఆ ప్రాజెక్టుకు కావలసిన డబ్బు ఖర్చుపెట్టమని కేంద్రప్రభుత్వంమీద ఎందుకు ఆందోళన లేవదీయరని అడుగుతున్నాను.

పోతే యీనాడు మంత్రిగారు పొదుపు ఉద్యమం గురించి చెబుతున్నారు. గ్రామ సీమల్లో పేద ప్రజానీకం పొదుపు చేసుకొనే డబ్బుమీద మనం ఆధార పడ వలసి ఉంటుందన్న మాట. పొదుపు ఉద్యమం అని పేరుపెట్టి పేదప్రజలను బాధించటం సరైందికాదు. మేము పొదుపు ఉద్యమం అనేదానిని పూర్తిగా వ్యతి రేకిస్తున్నాము. పొదుపు ఉద్యమం అన్నది అర్థంలేని నినాదమని చెప్పకతప్పదు. కేంద్రప్రభుత్వం మనదగ్గరనుండి ఎంతోడబ్బు తీసుకుంటోందిగాని, మనం మాత్రం వారిదగ్గరనుండి డబ్బుతీసుకోము. భూస్వాములమీద ఎక్కువపన్ను వేయరు పేదప్రజానీకం నుండి పొదుపు ఉద్యమం అనేపేరుతో, నిర్బంధనిర్బంధంగా డబ్బువసూలు చేస్తున్నారు. రూపాయి శిస్తు కట్టేవాడిదగ్గరనుండి, ఇంకో రూపాయి పొదుపుక్రింద నిర్బంధంగా తీసుకోవటం అర్థంలేని పని. ఇటువంటి పద్ధతిని వెంటనే అరికట్టక తప్పదు. ఈ విధంగా పేదప్రజల దగ్గరనుండి డబ్బు తీసుకొని పరిశ్రమాభివృద్ధి చేస్తామనుకోవటం పొరపాటు. ప్రజల జీవస్థాయిని పెంచటానికి యీ ప్రభుత్వం ఏమీ చేయటం లేదు. చిన్నచిన్న ప్రభుత్వోద్యోగు లందరికి, వందరూపాయలు జీతం తీసుకునే వారికి నెలకు 6 రు. డి. ఎ ఇవ్వమంటే కొందరికి మాత్రమే ఇవ్వటం జరిగింది. అనేక మందికి ఇవ్వటంలేదు. ప్రభుత్వ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులకు యీ డియర్‌నెస్ ఎలవెన్స్ ఇవ్వటం లేదు. మిగిలిన రాష్ట్రాలలో ఇచ్చినట్లుగా అందరికి 12 రు. పెంచమంటే, "అబ్బో.... చాలాడబ్బు అవుతుంది" అంటున్నారు. ప్రభుత్వం ఇస్తున్న ఆరు రూపాయలు, హైదరాబాదు సిటీలో ఇస్తున్న పన్నెండు రూపాయలు కలిపి లెక్కచూస్తే, ప్రభు త్వానికి ఒక కోటి, 75 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. వంద, రెండువందల మధ్యజీతం వచ్చేవారికి అదనంగా ఇచ్చే ఆరు రూపాయలు కేంద్రసహాయంనుండి కాకుండా రాష్ట్రప్రభుత్వమే ఇస్తోందని అనవచ్చును. అది తీసివేసినా, ఇందుకు అయ్యే ఒకకోటి 50 లక్షల రూపాయల ఖర్చుతో ఒకకోటి రూపాయలు కేంద్రప్రభు త్వమే ఇస్తోంది. మనరాష్ట్రం 50 లక్షలు మాత్రమే ఇందుకు ఖర్చు పెట్టవలసి ఉంటుంది. అందుచేత యీ ప్రభుత్వం మరొక 50 లక్షలు ఖర్చు పెట్టటానికి తయారైతే అందరికీ నెలకు 12 రు. లు ఇవ్వటానికి వీలుంటుంది.

ఆర్థికమంత్రిగారు "ఇది మిగులు బడ్జెటు" అని అన్నంతమాత్రాన లాభం లేదు. ఇది మిగులు బడ్జటే! అందరి కడుపులుకోసి, అందరిని పస్తులు ఉంచి, ఏ పనులు చేయకుండా ఉంటే మిగులుబడ్జెటు తేలికగానే అవుతుంది. ఏ రాష్ట్రంలో ఉద్యోగులకు ఎక్కువ జీతాలు ఉన్నాయో, ఆ జీతాలను ఇక్కడ ఆంధ్రతెలంగాణా

ఉద్యోగులకు బేసిక్ పేగా తీసుకొని, ఆ విధంగా జీతాలను పెంచి, ఖర్చును మీట్ అయి, మిగులు చూపించినపుడే, ఇది మిగులు బడ్జెట్ అవుతుంది. అలా కాకుండా "ఏదో ఘనకార్యం చేశామని, మిగులు బడ్జెటు తయారు చేశామని" దీంకరే అను కొన్నందువల్ల లాభంలేదు. ఇది కేవలం ప్రజలకష్టాలను కప్పిపుచ్చినట్లు అవుతుంది. కేంద్రప్రభుత్వ ఉద్యోగులకు ఒకజీతం, రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులకు ఒకజీతం ఉండటం న్యాయం కాదు. వీరి జీతాలలో చాలా తేడా ఉంటున్నది. "రాష్ట్ర ప్రభుత్వఉద్యోగులతో సమానంగా కేంద్రప్రభుత్వ ఉద్యోగుల జీతాలను తగ్గించటానికి ఉపాయాలు ఆలోచిస్తున్నాము" అని గోపాలరెడ్డిగారు బహుశః చెప్పవచ్చును. కాని కేంద్రప్రభుత్వ ఉద్యోగుల జీతాలు తగ్గించటం యీ ప్రభుత్వ తరంకాదని చెబుతున్నాను. వారి జీతాలు తగ్గించే ఉపాయాలు మన ఆర్థిక మంత్రిగారికి చేతకావు. వారి జీతాలు యీ ప్రభుత్వం తగ్గించలేదని చెబుతున్నాను. ఈ ప్రభుత్వం చేయ గలిగింది ఒక్కటే, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల జీతాలను, కేంద్రప్రభుత్వ ఉద్యో గుల జీతాలతో సమానంగా చేయటమే. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు పెంచ టానికి డబ్బు ఎక్కడనుంచి వస్తుందంటారా ? కేంద్రప్రభుత్వం మన రాష్ట్రం నుండి కోటానుకోట్ల రూపాయలు తీసుంకుటోంది. వారి దగ్గరినుండి మనం డబ్బు తీసుకొని మనఉద్యోగుల జీతాలనుపెంచాలి. కేంద్రప్రభుత్వం మనరాష్ట్రంనుంచి డబ్బు తీసుకువెళ్ళి, తన ఉద్యోగుల జీతాలు పెంచుతోంది. కేంద్రప్రభుత్వ ఉద్యోగులకు, నాలుగవ గ్రేడువారికైనా నెలకు 75 రూ. లు గిట్టుబాటు అయ్యేటట్లు ఉండాలని కేంద్రప్రభుత్వం అనుకుంటోంది. కేంద్రప్రభుత్వ ఉద్యోగులే మనుష్యులా ? మిగిలినవారు కారా ? తిండి వారే తింటారా? మిగిలినవారు తినరా ?—అని అడుగు తున్నాను. మన రాష్ట్రంనుండి తీసుకొన్న డబ్బు తిరిగి మనకు ఇచ్చి, మన ఉద్యోగుల జీతాలు పెంచటానికి ఎందుకు ప్రయత్నం చేయరు? చిన్నచిన్న ఉద్యోగుల జీతాలు పెంచటం విషయంలో, ఉపాధ్యాయుల జీతాలు పెంచటం విషయంలో యీ ప్రభు త్వం మొండిచేయి చూపుతోంది. వీరి జీతాల సమస్య పరిష్కరించకుండా "ఆంధ్ర—తెలంగాణా భేదం రాకూడదని, ప్రాంతీయ విభేదాలు రాకూడదని, ఉద్యోగస్థులమధ్య ప్రమోషన్ల విషయంలో గొడవలు రాకూడదని" అనటంలో అర్థంలేదు

ఎగ్రికల్చరల్ గ్రాడ్యుయేట్స్‌కు ప్రారంభ జీతం వంద రూపాయలు ఉన్నది. ఇంజనీర్సుకు 150 రు. లు జీతం ఉన్నది. అందుచేతనే ఫస్ట్‌క్లాస్ వస్తేగాని ఇంజ నీరింగులో సీటు దొరకదు. ఇతరులమీద పెత్తనం చేసే ఐ.ఎ.యస్. ఉద్యోగులకు 800 రు. ల నుండి 1800 రు. ల వరకు జీతం ఇస్తున్నారు. ఈ రకంగా జీతాలు ఇచ్చుకోవటంలో అర్థం ఏమిటి ?

మా తరపున మేము కోరేదేమిటంటే— రు. 250 నుండి 500 వరకు ప్రొఫెషనల్‌గ్రాడ్యుయేట్స్‌కు జీతం ఇవ్వాలి. లెక్చరర్స్‌కు ఇస్తున్న జీతమే వారికి

కూడ అప్లయ్ చేయాలి. ఒక ప్రక్క వ్యవసాయం అభివృద్ధి కావాలంటారు. కాని ఎగ్రికల్చరల్ గ్రాడ్యుయేట్స్‌కు సరైన జీతాలు ఇవ్వరు. ఉద్యోగస్థుల జీతాలు పెంచే విషయంలో యీ ప్రభుత్వం మొండిచేయి చూపిస్తోంది.

ఇప్పుడు కొత్తగా గవర్నమెంటు ఉద్యోగస్థులు కంపల్‌సరీగా ప్రావిడెంట్ ఇన్సూరెన్స్ చేయాలంటున్నారు. ఇదివరకు 2శాతం కంట్రిబ్యూషన్ ఇచ్చేది. ఇక ముందు 4 శాతం ఇవ్వాలని చెబుతున్నారు. ఇది ఉద్యోగస్థులకు సంతృప్తి ఇవ్వదు. "మాకుతిండిలేక బాధపడుతున్నాము, మాజీతాలు పెంచండి" అని ఉద్యోగులు అడుగుతూంటే, "మీరు చచ్చిపోయిన తరువాత మీ బిడ్డలకు డబ్బు ఇస్తాము. ఇప్పుడు 4 శాతం డబ్బు కట్టండి" అని చెబుతున్నారు. ఇది ఒకరకమైన పొదుపు ఉద్యమం తప్ప, ఇన్సూరెన్సు సౌకర్యాలు కలుగజేసి ఉద్యోగులకు మేలు చేశామని అనుకోవటం పొరపాటే అవుతుంది. ఇటువంటి పనికిమాలిన స్కీములు తీసుకురావద్దని చెబుతున్నాను.

ఈ ప్రభుత్వం కార్మికుల జీతాలు పెంచటం లేదు. ఉన్న జీతాలను గ్యారంటీ చేయటంలేదు. లేబర్ యూనియన్స్ స్ప్లిట్ చేస్తున్నారు. కార్మికులను యజమానులు విక్టిమైజ్ చేస్తూంటే, దానికి ప్రభుత్వం ప్రోద్బలం ఇస్తోంది. మూడు నాలుగేళ్ళ తర్వాత, విధిలేక వారు సమ్మెలు చేస్తే మీ నాయకులను అరెస్టు చేస్తాము. మీ సమ్మెలను అణచివేస్తాము అని బెదిరిస్తున్నారు. ఈ బెదిరింపులతో కార్మికుల సమస్యలను పరిష్కరిస్తా మనుకోవటం చాలా పొరపాటు. ప్రభుత్వానికి బలం ఉందని తెలుసు. కాని "కార్మికులను అణచివేస్తాము, సమ్మెలను అణచివేస్తాము" అని బెదరించినంత మాత్రాన భయపడేవారు ఎవరూ లేరు. జైళ్లు అంటే, భయపడేవారెవరూ లేరు. రోజూ ఒక మంత్రి ఈ విధంగా బెదరించినంత మాత్రాన, ఆ బెదరింపులకు లొంగే ప్రతిపక్షంగాని, శాసనసభ్యులుగాని ఉంటారని అనుకొంటే అందులో అర్థంలేదు. ఆ బెదరింపులు ఆపేసి, మన మంత్రులు శాసనసభలలో బాధ్యతాయుతంగా ప్రవర్తించకపోతే ఏమీ ఉపయోగం ఉండదు.

కనీసము యీ కార్మికులు కేంద్రీకరించిన చోట్లలోనైనా వాళ్ళ ఆహార ధాన్యాలు చౌక ధరలకు లభించేందుకు చౌక డిపోలు ఏర్పాటు చేయమని కోరినప్పటికినీ, అది గూడ చేయలేదు. వ్యవసాయ కార్మికులకు ఇళ్ళ స్థలాలక్రింద తొమ్మిది లక్షలు మాత్రమే ఖర్చుచేస్తున్నారు. ప్రతి సంవత్సరము కార్మికుల కోసము ఒక కోటి రూపాయలు ఖర్చుచేస్తున్నప్పటికినీ, ఈ కార్మికుల ఇళ్ళసమస్య వంద సంవత్సరములలోనైనా పూర్తికాదని శ్రీ సంజీవయ్యగారుకూడ ఒప్పుకున్నారు. ఇదేనా యీ ప్రభుత్వముయొక్క పద్ధతి? లేకపోతే ఇంకా ఏదైనా మరొక పద్ధతి చూస్తారా? అని అడుగుతున్నాను. ఇంతేకాకుండా వాళ్ళ ఆరోగ్యము, విద్యనుగురించి ప్రభు

త్వము ఏలాంటి చర్య తీసుకుంటున్నదని నేను అనుకోవడములేదు. ఈ విషయ మును గురించి నేను ఆ డిమాండు వచ్చినప్పుడు మాట్లాడుతాను. పైగా, వారికి భూ సమస్యకూడ ఒకటి ఉన్నది. వ్యవసాయకూలీలుగా ఉన్న కుటుంబాలు, కేవలము గ్రామసీమల్లో కూలీమీద ఆధారపడి జీవిస్తున్నవారు ఉన్నారు. ప్రభుత్వం భూసంస్కరణలు తెస్తామని చెబుతున్నారు. భూ సంస్కరణలు ప్రవేశపెట్టినప్పుడు వాటి స్వరూపము ఎట్లా ఉంటుందో చూచి, దానిని గురించి detailed గా మాట్లాడుతాను. రాష్ట్రములో ఒక్కొక్క కుటుంబానికి 20 Standard acres చొప్పున ఉన్నటు వంటి కుటుంబాలు 80 వేల కుటుంబాలు ఉన్నవి. ఆ కుటుంబాలకు ఒక్కొక్కదానికి ఇరవై ఎకరాల చొప్పున విడిచిపెట్టి మిగులుభూమి ఎంత ఉంటుందని లెక్కచూస్తే సుమారు 12 లక్షల ఎకరాలు ఉంటుంది. భూమి మొత్తము 28 లక్షల ఎకరాలు ఉన్నదని లెక్కలు చెబుతున్నవి. ఇందులో భూకామందులకు 16 లక్షల ఎకరాలు వదిలిపెట్టినా, ఇంకా 12 లక్షల ఎకరాలు మిగులుతుంది. గ్రామసీమలలో కూలిపని దొరకకుండా బాధపడేవారు సుమారు 20 లక్షల కుటుంబాలు ఉంటున్నప్పుడు, ఈ కుటుంబాలకన్నింటికి ఒక్కొక్క కుటుంబానికి ఎకరం, అరఎకరం ప్రకారము ఈ మిగులు భూమిని పంచిపెట్టండి. ఇవిగాక బంజరు భూములు ఉన్నవి. అవి వేరే ఉంచండి. వీటి సంగతికి వచ్చినప్పుడు, విడిగా ఆలోచించవచ్చు. ప్రస్తుతము యీ 12 లక్షల ఎకరాల విషయము తీసుకోండి అని అంటే అది కాదంటారు. ఇరవై ఎకరాల చొప్పున కాదు, 30 ఎకరాల చొప్పున తీసుకుంటామని అంటు న్నారు. ఆ విధముగచేస్తే, ఇక వ్యవసాయ కూలీలకు ఏమీ మిగలదు. వ్యవసాయ కూలీలకు ఏమి మిగల్చకుండా చేయాలనే ప్రభుత్వం 30 ఎకరాలు విడిచిపెట్టాలని అంటున్నారు. అలాగైతే ఏ రెండు, మూడు లక్షల ఎకరాలో మిగులుతుంది. ఇప్పుడు తిండిలేకుండా బాధపడే వ్యవసాయకూలీలకు యీ రెండు, మూడు లక్షలు యే దామాషా ప్రకారము ఇవ్వాలని ప్రభుత్వముద్దేశిస్తున్నది? ఇదివరకు Ordinance ను గురించి ఇక్కడ చర్చించినప్పుడు ఈ కుటుంబాలకు యేమాత్రముకూడ ఇవ్వము అని ఘంటాపథముగ చెప్పింది. అలాగైతే ఇక భూ సంస్కరణలు అంటే అర్థ మేమిటి? భూ సంస్కరణలు తెచ్చినప్పటికినీ, వాటివల్ల ఉపయోగము యేమైనా ఉంటుందా? ఇదిగాక ప్రశ్నల కాలములో తిమ్మారెడ్డిగారు ధరలు పెరగలేదు, పెరగ లేదని చెప్పడము న్యాయమైన విషయముకాదు. వారావిధముగ చెప్పడము భూస్వా ములకే లాభముఅని గురుమూర్తిగారు అంటే, అలాంటప్పుడు ఎకరము, రెండు ఎకరాలు ఉన్నవారు ధాన్యము అమ్ముకోవాలంటే వాళ్ళకు గిట్టుబాటు అవుతున్నదా అని గోపాలరెడ్డిగారు అన్నారు. గోపాలరెడ్డిగారు స్వంతముగ వ్యవసాయము చేయకపోయినను (Interruption)...

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- వారు వ్యవసాయము స్వంతముగా చేశారా?

శ్రీ పి. సుందరయ్య:- ఆ, నేను చేశాను. మూడు సంవత్సరాలు చేశాను. 1933 నుంచి 1936 దాకా వ్యవసాయములో ప్రతిపని చేశాను. ఈ రోజున కూడ చేయగలను. గోపాలరెడ్డిగారు నాతో పోటీచేస్తానంటే చేయవచ్చును, రమ్మనండి. గోపాలరెడ్డిగారు వ్యవసాయము చేయకనే మాట్లాడుతున్నారు. నేను చేసి మాట్లాడు తున్నాను. అనుభవం మీద మాట్లాడుతున్నాను. ఎకరము రెండు ఎకరాలు ఉన్నవారు ఎంతెంత పండిస్తున్నారు? మహా బాగా పండితే, ఒక్కొక్క ఎకరములో 10, 15 బస్తాలకంటె ఎక్కువ పండదు. ఈ పది, పదిహేను బస్తాలు పండించుచున్న కుటుంబాలు మన ఆంధ్రప్రాంతములో పన్నెండు లక్షల కుటుంబాలు ఉన్నవి. ఈ కుటుంబాలు ఏమైనా అమ్ముకోటానికి సాధ్యమవుతున్నదంటారా? ఒకవేళ అమ్ము కుందామనుకుంటే, వాళ్ళు మరల తిండికి బజారులో కొనుక్కొని తినవలసిందేగదా! ఈ విధముగ చేసేది ఎకరము, రెండు ఎకరాలు, మూడు ఎకరాలు, ఈలాంటి చిన్న చిన్న extents ఉన్నవాళ్లు చిన్న కుటుంబములవాళ్ళు. ఇక 20 ఎకరాలు, 30 ఎకరాలు, 50 ఎకరాలు, నూరు ఎకరాలు, ఈ మాదిరి వందల కొలది ఎకరాలు ఉన్నవారు తమకు ఎక్కువగ పండుతూ ఉంటుంది గనుక, వాళ్ళు ఎక్కువగ లాభము సంపా దించుకోటానికి ఇష్టము వచ్చిన ధరకు అమ్ముకోటానికి ప్రచారము చేస్తున్నారు. అలాంటివారి వెనుక ప్రభుత్వం దాగుకొని ఈ ప్రచారానికి సహాయపడుతున్నది. ఎంతసేపటికినీ భూస్వాములకే లాభము చేయటానికి బస్తా ఒకటికి 30 రూపాయలు అమ్మితేగాని, భూ ఖామందులకు గిట్టుబాటు కావడంలేదని చెబుతున్నారు. అయితే చిన్న చిన్న రైతులు కష్టపడి పండిస్తున్నవారి పేరుమీద భూస్వాములు దాగుకో కూడదు. భూ సంస్కరణల విషయములో ఏదోరకముగ దాగుకొని, రైతులకందరికి అన్యాయము చేస్తున్నారని చెబుతున్నారు. ఈ అన్యాయము చేసేది ఎవరు? రైతులు కాదు. భూస్వాములే. ప్రభుత్వముకూడ భూస్వాములకు సహాయము చేయాలనే. ప్రభుత్వము 20 ఎకరాలు కాదు, 30 ఎకరాలు ఉండాలంటున్నారు. మేము 20 ఎక రాలు ఉంచి తక్కినది పంచిపెట్టండి అని కోరుతున్నాము. ఈ 20 ఎకరాలు పెట్టు కుని ఒక్క పది సంవత్సరాలపాటు తట్టుకోమని మేము కోరుతూంటే, అల్లా వీలు కాదని అంటున్నారు. ఇతర ఆదాయములమీద సీలింగు లేకపోతే, భూములమీద మాత్రము సీలింగు ఎందుకు అంటున్నారు. మిగిలిన ఆదాయములమీద సీలింగుపెట్టి నప్పుడు, భూములమీద పెట్టండి అంటున్నారు. కాబట్టి వాటికి లేదుగనుక, భూములకు సీలింగు అక్కరలేదు అనే ధోరణిలో మాట్లాడుతున్నారు. అన్ని రకాల ఆదాయ ముల మీద సీలింగు పెట్టమని గోపాలరెడ్డిగారు ముందుకు ఎందువల్ల రాకూడదు? భూములమీద సీలింగు వద్దు అని చెప్పే బదులు, మిగతా ఆదాయములమీద సీలింగు

పెట్టండి అని గోపాలరెడ్డిగారు చెప్పవలసి ఉంటుంది. వారు ఆ విధముగ ముందుకు వచ్చి చెప్పినట్లైతే, గోపాలరెడ్డిగారు నిజముగ ప్రజల క్షేమం కోరుతున్నారనే చెప్పుకోవచ్చు. ఎవరు చెప్పనక్కరలేదు. నేనే అందరికీ చెబుతాను. ప్రభుత్వమైతేనేమి యీ విధముగ ఉండడమువల్ల భూస్వాములుకూడ, ఇతరత్రా ఆదాయములు సంపాదించుకునే వారికి సీలింగు లేకపోతే మాకు మాత్రము ఎందుకు అంటున్నారు. వాళ్లకు పెట్టితే మాకు పెట్టండి. వాళ్లకు సీలింగు పెట్టలేదు గనుక, మాకు అక్కరలేదు అని భూస్వాములు అంటున్నారు. భూస్వాములు, ప్రభుత్వము యీ విధముగ ఒక దానితో ఒకటి ముడి పెట్టుతూ, కాలయాపన చేయటానికి పీఠంతా ఒక గూడుపుఠాణీగా తయారైనారు తప్ప మరేమి లేదు. ఈ విధంగా పరిస్థితులు ఉండేటట్లైతే ప్రభుత్వము మనదేశమును ఏ మాత్రము ముందుకు తీసుకుని పోవడం సాధ్యము కాదనే చెప్పవలసి ఉంటుంది. బడ్జటు ఉపన్యాసమును బట్టి చూస్తే, ప్రజల జీవిత ప్రమాణములు సంవత్సర సంవత్సరము దాటినకొద్దీ, పెరిగేటట్లు కన్పించడము లేదు. అభివృద్ధి కార్యక్రమముల క్రింద ప్రతి సంవత్సరము ఖర్చు చేస్తున్న సొమ్ము రానురాను తగ్గిపోతున్నది. పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, నీటి పారుదల క్రింద ఖర్చు చేసే సొమ్ము తగ్గిపోతున్నది. ఇవి అన్నీ ఇట్లా ఉంటూన్నప్పుడు, ధరలు మాత్రము పెరుగుతునే ఉన్నవి. ప్రజల జీవిత స్థాయి చూస్తే, పెరగడము లేదు. చిన్న చిన్న ఉద్యోగుల జీతాలు చూస్తే, అవి పెంచలేదు. నిరుద్యోగము ఎక్కువై పోయింది. రాష్ట్రములో యీలాంటి పరిస్థితులుంటున్నప్పుడు శాసనసభ్యులు సూచనలు చేస్తేగూడ ఏ మాత్రము లక్ష్యము చేయకుండా ప్రభుత్వము పరిపాలించుచున్నదంటే, ఇది ఏ విధంగాను ప్రజల క్షేమమును కాంక్షించేది కాదని చెప్పవలసి ఉంటుంది. కాబట్టి ప్రభుత్వము కొంచెము జాగ్రత్తగా ఆలోచించి, దేశములోని పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని, శాసనసభ్యులు ఇదివరకు చేసిన సూచనలు, యిప్పుడు యీ బడ్జటు సందర్భములో చేసే సూచనలు అన్నింటిని పరిశీలించి ప్రభుత్వ వ్యవహారాలు దేశమును ముందుకు తీసుకునిపోయే రీతిగా నడపవలసిందని, లేకపోతే, ఇదే స్థాయిలో ప్రభుత్వం నడిచేటట్లైతే, అది ప్రజల క్షేమదృష్ట్యా కాదని చెబుతున్నాను.

*డాక్టర్ బి. గోపాలరెడ్డి:- అధ్యక్షా, ఈ బడ్జటును గురించి నాలుగు రోజులుగా చర్చ జరిగింది. అరవై నలుగురు సభ్యులు మాట్లాడారు. వారు మాట్లాడేటప్పుడు వారి వారి దృక్పథముల ప్రకారము యీ బడ్జటును పరిశీలించారు. ఆ మాట్లాడేటప్పుడు కొంత ఆవేశానో, ఆవేదానో, ఆగ్రహానో, విమర్శనో, లేకపోతే సానుభూతినో చూపించుచు మాట్లాడారు. ఈ బడ్జటును తయారు చేయడములో గౌరవ సభ్యుల యొక్క ప్రాంతీయాభిమానము అనిగాని, లేకపోతే ప్రాంతీయ పార్టీలకు సంబంధించిన దృక్పథములు అనిగాని ఏమీ లేవు. ఇది వేరు వేరు

దృక్పథములతో దీనిని తయారు చేశారు అని అనుకోవడము చాలా పొరబాటు. ఏ విధముగనైనా కష్టపడుతున్న వారికి యీ బడ్జటులో ఏమైన ప్రయోజనము ఉన్నదా, లేదా అని చూచుకోవడము సహజమే. అలాంటిది ఏమీ లేనప్పుడు కొంతవరకు విచారపడడము కూడ సహజము. లేదా ఏదైన కొంత మేలు ఉన్నదని అనుకుంటే, సంతోషించడముకూడ ఉంటుంది. ఎలాంటి విభేద దృక్పథములతోను ఇది తయారు చేయలేదు. అందరు ఒకే దృక్పథముతో చూచి ఏకగ్రీవముగ ఆమోదిస్తారనో, లేక విమర్శిస్తారనో అనుకోవడము కూడ న్యాయమైన విషయము కాదు. ఇందులో కొన్ని అతిశయోక్తులు ఉండవచ్చు. లేకపోతే సహజమైన విషయములు ఉండవచ్చు. సభ్యులలో కొంతమందికి వారి వారికి ఉన్న ఆగ్రహములవల్ల చెప్పిన విషయాల్లో కొన్ని కొన్ని నిశ్చితమైన భావములు ఉండవచ్చు ఈ బడ్జటును గురించి యీ 64 గురు సభ్యులు వివిధ రకాలుగ మాట్లాడడము సహజమే. కొంతమంది మాట్లాడుతూ ఏదో యీ సంవత్సరమునకు Surplus Budget తయారు చేశాను అని గోపాలరెడ్డిగారు సంతోష పడుతున్నారు, ఈ విధముగ తయారు చేయడము ఎవరిని సంతోష పెట్టటానికి? ఒక ప్రక్కన ప్రజలు ధరలు ఎక్కువై, జీవిత ప్రమాణము పెరిగినందున ఖర్చులకు తాళ లేకుండా కన్నీరు కార్చుతూ ఉంటే, ఆయన ఆనంద భైరవి ఆలాపన చేస్తున్నారు, లేక ఫిడేలు వాయిస్తున్నారు అని అన్నారు. కాని ఇది ఎవరి surplus కాదు, ఎవరి బడ్జటు కూడ కాదు. ఇది ప్రభుత్వము యొక్క ఆదాయ వ్యయముల 1958-59 వ, సంవత్సరమునకు గాను తయారు చేసిన అంచనాల పట్టిక. అంతే కాని ఈ బడ్జటు రైతులది కాదు. హరిజనులది కాదు. ఇంకెవరిదో కాదు. వచ్చే సంవత్సరములో ప్రభుత్వానికి ఎంత రాబడి రాగలదు, ఎంత ఖర్చు. కాగలదు అనే వివరాలతో ఒక అంచనా పట్టికగా దీనిని తయారు చేసి సభ ఎదుట పెట్టామేగాని, ఇంకెవరి కొరకో కాదు. లేదా క్షామ పీడితుల కోసము కాదు. ఈ బడ్జటులోని వివరాలు చూచి, ఇందులో ఇది ఉన్నది, ఇది లేదు అని చెప్పవచ్చు. ప్రభుత్వము యొక్క అంచనాల ప్రకారము దీనిని surplus Budget అంటున్నాము.

ఇదేమీ గారడీకాదు. "ఇదేదో తమాషా చేశారు; ప్రజలను మైమరిపించడానికీ, వారిపై మత్తుమందు చల్లడానికీ surplus అంటున్నారు" అని కొంత మంది సభ్యులు అన్నారు. ఇది గారడీయే అయితే క్రిందటి 4 సం॥ల నుంచి చేసి ఉండవచ్చు. అట్లు చేయడానికి వీలుంటే క్రిందటి సంవత్సరం కూడా surplus చూపవచ్చు. కాని అట్లా సాధ్యంకాలేదు. ఈ సంవత్సరం మనం అనుకున్న దానికంటె Sales Tax వగైరాలలో ఎక్కువ లాభాలు వచ్చినాయి. మనం కొన్ని విమర్శలకు గురైనప్పటికీ కూడా కొన్ని విషయాలలో Finance Commission వారు సహాయం చేయడంవల్ల కొంత లాభం పెరిగింది. అందువల్ల ఇది surplus budget అయినదే కాని ప్రజలందరి కోరికల్లా తీరి శతాబ్దాల తరబడి అను

భవిస్తున్న కష్ట పరంపరలన్నీ తొలగిపోయి యీనాడు మిగులు బడ్జట్‌గా తయారు కాలేదు. మనం చేయవలసిన పనులు ఇంకా చాలా ఉన్నాయి. నేను దీనిని ఒక భావంతో Sputnik Budget అన్నాను. దాని తరువాత ఇంకా అనేక బడ్జటులు రావలసియున్నది. చంద్రగ్రహంలోనికి మానవుడు పోవాలంటే ఒకటికాదు రెండు కాదు వేయి స్పుట్నిక్‌లనైనా పైకి పంపాలి. అంతవరకు అక్కడి వాస్తవాన్ని మనం తెలుసుకోలేము. మన కృషి జయప్రదం కావాలి. మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తోనే పనులన్నీ నెరవేరవు తృతీయం, చతుర్థం, పంచమం. ఈ విధంగా అనేక పంచవర్ష ప్రణాళికలను మనం అమలు చేసుకోవాలి. ఏలాగైనా మనం ప్రజల యొక్క కష్టాలను నివారించడానికి ప్రయత్నంచేసినప్పుడు స్వతంత్రం యొక్క, స్వరాజ్యంయొక్క వాతావరణాన్ని పొందగలమనే అభిప్రాయంతోనే అట్లాచెప్పాను కాని మరొకటి కాదు. ఈ budget మాత్రం surplus గా ఉన్నది అనుకొంటే చాలదు. దీని తరువాత యింకా అనేకం రావలసియున్నదనే అర్థంలో చెప్పినాను.

ఇక క్రిందటి సంవత్సరం కేరళ ప్రభుత్వంవారు surplus budget చూపిం చారు. "చూశారా; మేము వచ్చీరాకముందే surplus budget చూపించాము; మిగిలిన రాష్ట్రాలన్నీ deficit చూపిస్తున్నాయి, మా తడాక చూచినారా " అనే రీతిగా కొందరు మాట్లాడారు. ఈనాడు మనకు అనుకూల పరిస్థితులు ఏర్పడి కొంచెం surplus budget చూపేసరికి "ఇదేమి surplus ఇదంతా గారడీ, మైమరపు" అంటున్నారు. అయితే యీ double standard of criticism తో ఎట్లా? criticism ఏదో ఒక standard లో కేరళ అయినా — తమిళనాడయినా, మధ్యప్రదేశ్ అయినా అన్నింటికీ ఒకటిగ ఉంటే మంచిది. కాని మమ్ములను విమర్శించేటప్పుడు ఒక standard ఇంకొకరిని విమర్శించేటప్పుడు యింకొక standard పెడితే కష్టంగా ఉంటుందనుకొంటాను. అదికాక, ఉన్న వాస్తవ పరిస్థితు లను గుర్తించడం మంచిది. అసలు surplus ఉన్నదా ? ఉంటే ఎందుకు వచ్చింది? అంటే ఒక్కొక్కసారి ఎక్కువ ఖర్చు పెట్టవచ్చు, ఒక్కొక్కసారి మన సుంద రయ్యగారు విమర్శ చేసినట్లుగాకూడా ఖర్చు చేయలేకపోవచ్చు. మనం ఒకపద్ధతిలో ముందుకు పోవలసియున్నది. ఈనాడు మనం పంచవర్ష ప్రణాళికకు బద్ధులమై ఉన్నాము. దాంట్లోనుంచి బయటపడలేము. మనకు పెద్దలుగా వున్నటువంటి Planning Commission వారి సలహా ననుసరించి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఫలానా ఫలానా డిపార్టుమెంటులమీద ఇంత యింత మొత్తాలను ఖర్చుచేయదలుచు కొన్నాము అని నిర్ణయించుకున్నాము. అదృష్టమో, దురదృష్టమో కాని తెలంగాణాకు సంబంధించి నంతవరకు పూర్వపు హైదరాబాదు గవర్నమెంటువారు పంచవర్ష ప్రణా ళికను నిర్మించుకున్నారు. దానితో పూర్వపు ఆంధ్ర ప్రభుత్వానికి ఏమాత్రం సంబంధంలేదు. రామకృష్ణరావుగారి మంత్రివర్గంవారే తెలంగాణాకు సంబంధించి

సంతవరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఏమేమి పనులు జరుపవలెనో వివరంగా నిర్ణయించుకున్నారు. ప్లానింగ్ కమిషన్‌యొక్క ఆమోదము పొందినారు. దాని కోసం పాటుపడడానికి మనమందరమూ కూడా కృతనిశ్చయులమై ఉన్నాము. ఈవిధంగానే ఆంధ్రకు సంబంధించికూడా కొన్ని నిర్ణయాలు జరిగాయి. దానికి మనం బద్ధులము. ఈ రెండు ప్రాంతాలకూ కలిసి 175 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. అందులో 56 కోట్లు తెలంగాణాకు సంబంధించి, దాదాపు 119 కోట్ల రూపాయలు ఆంధ్రకు సంబంధించి ఉన్నది. ఈ మొత్తాన్ని మనం ఖర్చు చేసుకోడానికి నిర్ణయించాము. ఆంధ్ర...తెలంగాణాల ప్లానులను integrate చేసుకొని 175 కోట్ల రూపాయలు అవుతుందని మనం అనుకున్నాము. తెలంగాణాకు సంబంధించిన 56కోట్లప్లానులోనూ, ఆంధ్రకు సంబంధించిన 119కోట్ల ప్లానులోనూ మార్పులు చేయమని సభ్యులెవ్వరూ సలహా ఇవ్వలేదు. 56 కోట్ల ప్లానును 76 కోట్లకుగాని 86 కోట్లకు గానిమార్పుచేద్దాము అనిగానీ, 119 కోట్ల ప్లానునూ, 99కోట్ల ప్లానుగా చేసుకొందామని గాని ఎవ్వరూ సలహా ఇవ్వలేదు. ఒకవేళ అట్టిసలహా చేసినప్పటికిన్నీ సాధ్యంకాదనుకుంటాను. ఇది వాస్తవమైన విషయం. తెలంగాణాలో యీ 56కోట్ల రు॥లను 5సం॥లలో ఖర్చు చేయాలి. 119 కోట్ల రూపాయలను ఆంధ్రకు సంబంధించిన జిల్లాలలో ఖర్చు చేసుకోవాలి. దానిని మార్పు చేయడానికి యిక్కడ మాట్లాడిన 64 మంది సభ్యులలో ఎవ్వరూ కూడా సలహా ఇవ్వలేదు. ఈ Plan మొదటి సంవత్సరంలో-అంటే 1956-57 సం॥లో తెలంగాణాలో గాని, ఆంధ్రలో గాని 25 కోట్ల రూపాయలు ఖర్చు అయినది. రెండవ సంవత్సరంలో 34 కోట్లకు అంచనా వేస్తున్నాము, కాని 30, లేక 31 కోట్ల వరకూ కావచ్చును అనుకొంటున్నాము. ఇక వచ్చే సంవత్సరం ... 3వ సంవత్సరంలో 30 కోట్ల చిల్లర ఖర్చు అవుతుందనుకున్నాను. ఈ మూడు సంవత్సరాలూ కలిసి 85 కోట్ల రూపాయిలు అయినది. 4, 5 సంవత్సరములలో 90 కోట్ల రూపాయలు ఖర్చు చేయవలసి యున్నది. ఇది మనమందరం కూడా గమనింపవలసిన విషయం. ఇప్పుడు యిది Surplus budget గా కనిపించినా, ఆనందంగా కనుపించినా ముందు ముందు అంటే 4, 5 సంవత్సరాలలో మనం ఎక్కువ త్యాగం చేసి, శ్రమపడి ద్రవ్యం సంపాదించుకొని 90 కోట్ల ప్లానును నిర్వహించుకోవలసి ఉన్నది. లేకపోతే, మనం Planning Commission కు యిచ్చిన వాగ్దానాలు గాని, ప్రజలకు యిచ్చిన వాగ్దానాలు గాని, నెరవేర్చలేక పోతామేమో: కాబట్టి కావలసిన త్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉండవలసినదని చెప్పాను. 3 సంవత్సరాలలో 85 కోట్ల రూపాయలు 4, 5 సం॥లలో 90 కోట్ల రూ॥లు ఖర్చు చేసుకోవాలి. అందువల్లనే 'పన్నులు వేయడం లేదు' అనే మాట నా బడ్జట్ ఉపన్యాసంలో ఎక్కడా చెప్పలేదు. అవసరమైతే మనమంతా కూర్చొని యీ విషయం చర్చించాలి. ఈ 90 కోట్ల ధనం ఇండియా ప్రభుత్వం నుంచి రాదు. ఈ సంవత్సరం ఖర్చుకు కావలసిన 30 కోట్ల లోనూ 18కోట్లు ఇవ్వడానికి వారు అతికష్టం

మీద అంగీకరించారు. సంజీవరెడ్డిగారు వెళ్ళి వారితో మాట్లాడి రావడమే కాకుండా, నేనూ రాజుగారూ వెళ్ళి త్రివేదీగారినీ, కృష్ణమాచారిగారినీ ఇంటిలోనూ, ఆఫీసులోనూ కల్సుకొని మాట్లాడితే కడపటికి 18 కోట్లు రూ॥లు ఇవ్వడానికి అంగీకరించారు. వారు ముందుగా 16 కోట్లు ఇస్తామని ప్రారంభించారు. ఈ నాడు మద్రాసు రాష్ట్రానికి కూడా 18 కోట్లు కంటె ఎక్కువ ఇవ్వలేదు. బొంబాయికి, యు. పి. కి తప్ప ఏ రాష్ట్రానికి కూడా 18 కోట్లు కంటె ఎక్కువ ఇవ్వలేదు. 18 కోట్లు వారు యిస్తే, మనం 12 కోట్లు సంపాదించుకోవలసి ఉన్నది. అది పన్నులు కాని, మిగులు కాని, retrenchment కాని, Small Savings వల్ల కాని, market లో సంపాదించే ద్రవ్యంవల్ల కాని — ఏ విధంగా అయినా 12 కోట్ల రూపాయలు సంపాదించు కొంటేగాని, 30 కోట్ల Plan సరిగా నిర్వర్తించుకోడానికి వీలుండదు. ఇటువంటి పరిస్థితులలో 4, 5 సంవత్సరాలలో ఒక్కొక్క సంవత్సరం 45 కోట్ల రూపాయలు ఖర్చు చేయాలంటే... ఒకవేళ ఇండియా గవర్నమెంటువారు 27 లేక 28 కోట్లు యిచ్చి నప్పటికిన్నీ ఇంకా 17, 18 కోట్ల రు. లు మనం సంపాదించుకోవలసియున్నది. అప్పుడే మనం ద్వితీయ ప్రణాళికను పూర్తి చేసుకొన్నామని చెప్పుకోడానికి వీలుం టుంది. లేకపోతే వీలుండదు. అందరి సభ్యులవలె నేనుకూడా యీ విషయాన్ని చెబుతున్నాను. ఒకవేళ ఏ కారణంవల్లనైనా.... ways and means position సరిగా లేకగాని, ఆర్థికస్థోమత చేకూర్చుకోలేకగాని మనం ద్వితీయ ప్రణాళికను పూర్తి చేసుకోలేకపోతే ....175 కోట్ల రు॥లను సంపాదించుకోలేకపోతే మనం ప్రజలకు ద్రోహం చేసినవారం అవుతాము. కాని, న్యాయం చేసినవారముకాదు—అంతేగాక, ప్రజలకు నిరాశ కలుగజేసినవారం అవుతామనే విషయంతో మాట్లాడిన, మాట్లాడని సభ్యులందరితోనూ ఏకీభవిస్తున్నాను. పార్టీ విభేదం లేకుండా, ప్రాంతీయ విభేదం లేకుండా కూర్మయ్యగారు చెప్పినట్లుగా communal feeling లేకుండా చెబుతున్నాను.

ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రజలందరికీ, ప్రభుత్వానికీ ఒక దీక్ష వంటిది. మనం దీక్ష వహించాము, కాబట్టి ఏ విధంగానైనా 175 కోట్ల రూపాయలూ ఖర్చు చేసుకోవలసియున్నది." అందువల్ల 4, 5 సంవత్సరాలలో మనం ఇంకా నడుము వంచవలసిన అవసరం ఉన్నది. త్యాగానికిలోబడి ద్రవ్యం సంపా దించు కోవలసిన అవసరం ఉన్నది. నేను ఏదో సంతోష పూర్వకంగా ఆనందభైరవి, అని తమాషాకు అంటే, దానితో చాలా రాగాలు కలిపారు మన గౌరవ సభ్యులు. అపస్వరాల ఆనందభైరవి అన్నారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు. ఏదో "నాదనామక్రియ" అని కొందరూ 'భాగేశ్వరి' అని కొందరూ అన్నారు. ఇంకా కొంతమంది 'భూపాల్' అన్నారు. ఇంకా కొంతమంది 'తోడి'రాగంలో, 'అఠానా'రాగంలో పాడినారుఅన్నారు. 'కోపంగా ఉన్నప్పుడు ఏరాగం పాఢాళి' అని నేను సంగీత నాటక పరిషత్తు అధ్యక్షుని అడిగాను. "అఠానా కావచ్చు

లేక తోడిరాగం కావచ్చు అని వారు చెప్పారు. అట్లాగే, తోడిరాగంలో కొందరూ అఠానారాగంలో కొందరూ మాట్లాడినారు. కాని, నేను సంతోషపడడానికి కారణం ఉన్నది. 1956–57 సం॥ ఆంధ్రవి 12 నెలలు, తెలంగాణావి 5 నెలలు లెక్కలు చూచినట్లయితే తెలుస్తుంది. ఆ లెక్క ప్రకారం 38 కోట్ల 44 లక్షల రూపాయలు ఉండగా 38 కోట్ల 1 లక్ష రూపాయలు ఖర్చుఅయినది, 43 లక్షలు మిగులు ఉన్నది. మొదటి సంవత్సరంలో అంటే 1956–57 లో 5 నెలలకూ మన ఆదాయం 38 కోట్లు మాత్రమే. ఖర్చు చేసినది 38 కోట్లు మాత్రమే.

1957–58 ఆర్థిక సంవత్సరంలో ఆంధ్ర ,తెలంగాణ రెండింటి ఆదాయం 53 కోట్లవరకు వచ్చింది. 33 కోట్లు ఉన్న బడ్జెటు 53 కోట్లు అయింది, 1958–59 సంవత్సరంలో 63 కోట్లవరకు బడ్జెటు వచ్చింది. గత సంవత్సరం 53 కోట్లు ఉన్న ఆదాయం ఈ సంవత్సరం 63 కోట్ల 66 లక్షలు అయినది. మన ఖర్చు 62 కోట్ల 87 లక్షలు ఔతున్నది. మిగులు 79 లక్షలు. 38 కోట్ల ఆదాయం 53 కోట్లు కావడం ఆ తరువాత 63 కోట్లు కావడం ఇతరులకు ఎలా ఉన్నప్పటికినీ, ఏ ఆర్థిక మంత్రికి గాని, ఏ ప్రభుత్వంనకుగాని సంతోషింపవలసిన విషయమే గాని వేరొకటి కాదు. గత సంవత్సరం కేటాయించిన మొత్తములు అన్నీ ఖర్చుకాలేదనుకోండి. సుందరయ్యగారు చెప్పినట్లు న్యాయంగా ఖర్చు పెట్టవలసిందే, కాని అలా ఖర్చు కాకపోయినప్పటికినీ, అది మురిగిపోయేది కాదు. కాబట్టి ఈ సంవత్సరం కాకపోతే వచ్చేసంవత్సరం ఖర్చుచేసుకోవచ్చు. కనుక డబ్బు ఖర్చుకాలేదు, అనుకున్న ప్రకారం కార్యక్రమాలు పూర్తికాలేదని వారు విచారమును చూపవచ్చును గాని ఆగ్రహింపవలసిన పనిలేదు. ఈ సంవత్సరం 63 కోట్లు ఆదాయం వస్తుంది కనుక కావాలంటే ఈ 63కోట్లను ఖర్చుపెట్టుకోవచ్చు. సంపాదనాశక్తిని ఇంకా ఎక్కువ చేసుకుంటే వందకోట్ల రూపాయలు సంపాదించవచ్చు. ఆ డబ్బునంతా ఖర్చుచేసి అనేక సౌలభ్యములను కలుగచేసుకోవచ్చు. ఆంధ్రరాష్ట్రం వచ్చినప్పుడు 19 కోట్లుఉన్న ఆదాయం 63 కోట్లుకావటం చాలా సంతోషదాయకమైన విషయం. అందువల్లనే నేను ఆనంద భైరవిలో ప్రకటించుచున్నానని చెప్పినాను. దానిని సభ్యులు కొంతమంది భూపాలం అని, అసావేరి అని లేక భాగేశ్వరి అని ఇంకా ఏవేవో అనడం న్యాయమైన విషయం గాదు: ఇంత ఆదాయ అభివృద్ధి కలుగుటకు అందరూ కారకులే. ఇది కేవలం ఒక వ్యక్తి తీసికొనే Credit కాదు. మీ అందరి బలంతోనే ఈ నాడు ఇంత ఆదాయమును సంపాదించ గలిగాము, అందువల్ల నేను సంతోషపడుటకు కారణభూతమైనది. ఇక ఈ బడ్జెటు ప్రసంగంలో భూ సంస్కరణలగురించి చెప్పలేదు అని కొంతమంది సభ్యులు విమర్శించారు. భూసంస్కరణలు త్వరలో ప్రవేశ పెడతామని చెప్పినంత మాత్రమున ప్రజలు సంతృప్తి చెందరు, దానికి సంబంధించిన వివరములన్నీ ప్రభుత్వం ఇవ్వగలిగేస్థితిలో ఉన్నయెడల తప్పకుండా ఆ

బిల్లును తెచ్చేవారమే. It is still in the process of being made. Proposals అన్ని finalise కాలేదు. వెంకటాద్రివుగారు ఆ విషయం గురించి ప్రతి దినం చెప్పుచునే ఉన్నారు. అలాంటప్పుడు బడ్జెట్ ఉపన్యాసములో లేనంతమాత్రాన ఆగ్రహించవలసిన అవసరంలేదు. ప్రొహిబిషన్ సంగతి ఏమీ ప్రస్తావించలేదే అని ఎక్బోటేగారు అన్నారు. హిల్ ట్రైబ్సు, బాక్వర్డు క్లాసెస్, షెడ్యూల్డు క్యాస్ట్సు అభివృద్ధికొరకు ఏదో చేస్తున్నామని ఒక్కమాటైనా చెప్పరాదా అని లచ్చన్నగారు అన్నారు. చెప్పిన విషయములకన్న చెప్పనట్టి విషయాలే ఎక్కువని నాకు తెలుసు. ఆ విషయాలన్నింటి గురించి చెప్ప ప్రారంభిస్తే ఈ బడ్జెట్ ఉపన్యాసం చాలదు. రాబోయే సంవత్సరంలో ఏమి జరుగుతుందో దానిని గురించి ఒక స్థూల అభిప్రాయమే ఇవ్వగలము. మద్రాసులో డిమాండ్సుమీద చర్చ పదిరోజులు మాత్రమే ఉండేది. ఇప్పుడు సుందరయ్యగారి కృషివల్లనో, ఇంకొకరి కృషివల్లనో అది 16 రోజులైనది. ఈనాడు మనం 16 రోజులు డిమాండ్సుకోసం ఖర్చుపెడుతున్నాం. ఖర్చుఅంటే ఉపయోగకరమైన ఖర్చే అనుకోండి. .. ....

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:- మన ఆదాయం పెరిగినట్లే అదిగూడ పెరిగింది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- అవునవును. అలాగే పెరిగింది. ఇక పదహారు దినములు డిమాండ్సులో ఒక్కొక్క మంత్రిగారు వారివారి డిపార్టుమెంట్సుకు సంబంధించిన విషయములు చెప్పుతారు. మన సోదరులు పట్టాభి రామారావు, నరసింగరావు గార్లతో వారి డిపార్టుమెంట్సుకు అయ్యే ఖర్చుల వివరములను అవసరమైతే సైక్లోస్టైల్ చేసి శాసన సభ్యులందరికీ పంచిపెట్టమని చెప్పినాను. అది పబ్లిసిటీలాగా ఉంటుంది. పేపర్లలోగూడ ప్రకటిస్తారు. సభ్యులకు డిపార్టుమెంట్సులో జరిగే విషయములు చాలా తెలియవు. కాబట్టి 16 దినములు పూర్తిగా వినియోగించుకోండి. సభ్యులకు ఒక ఎడ్యుకేటివ్ వాల్యుగా ఉంటుందనిగూడ తెలియజేసినాను. ఈ 16 దినాలలో డిమాండ్సుమీద ఒక్కొక్క డిపార్టుమెంటుకు సంబంధించిన అనేక విషయములు మాట్లాడుకోవచ్చు. అంతేగాని ఇవన్నీ బడ్జెట్ ప్రసంగంలో ఉండితీరాలి. అది సాంప్రదాయం. ఆ సాంప్రదాయమును గోపాలరెడ్డిగారు అనుసరించడం లేదని చెప్పడం న్యాయంగా ఉండదేమో? ఇందులో General financial policy, Taxation స్థూలంగా birds-eye-view మాదిరి ఉండవలసిందేగాని అవీ బడ్జెట్ ఉపన్యాసంలో చెప్పడం, దానిమీద concentrate చేయడంగూడ న్యాయంకాదను కుంటాను. ఒక్కొక్క డిపార్టుమెంటుకు సంబంధించిన డిమాండు వచ్చినప్పుడు దానిమీద concentrate చేసి వారివారి జిల్లాలలో, తాలూకాలలోని కష్టనిష్టూరాలు చెప్పుకోవచ్చు. ఎంతవరకు ప్రొవిజను ఉన్నదో లేక ప్రొవిజన్ ఎందుకు చేయ లేక పోయినారో, ఇంకా మూడు, నాలుగు సంవత్సరములలో ప్లాన్‌లో ఏమిచేయ్య

టకు వీలౌతుందో అన్నీ విచారించి చేసుకోవచ్చు. అందువల్ల ఆ విషయంలోగూడ నేను ఏమీ తప్పుచేయలేదు. కొన్నికొన్ని విషయములు చెప్పనంత మాత్రమున సానుభూతి లేదనిగాని, లేక వారి అభివృద్ధికి ఖర్చు పెట్టడం లేదనిగాని మా ఉద్దేశం గాదు. షెడ్యూల్డు ట్రైబ్సుకు, హిల్‌ట్రైబ్సు మొదలగువారికి ప్రతి సంవత్సరం ఎంత ఖర్చుపెట్టుచున్నది నాదగ్గర లెక్కలు ఉన్నవి. షెడ్యూల్డు ట్రైబ్సుమీద 1956_57లో 38 లక్షలు ఖర్చుపెట్టితే 1957_58లో 77 లక్షలకు ప్రొవిజన్ ఉన్నది. ఇంకా revised estimate 83 లక్షలకు ఉన్నది. 1958_59లో 82 లక్షలు ఖర్చు పెట్టాలని ఉన్నది. దానిలో కేంద్ర ప్రభుత్వ సహాయంకూడ కొంత ఉన్నది. 1958_59లో ఆంధ్ర, తెలంగాణ రెంటిలో కలిపి 82 లక్షలు ఖర్చుపెట్టాలని ఉన్నది. .. ....

శ్రీ పి. సుందరయ్య :- అందులో 40 లక్షల దాకా రోడ్లకు, అడ్మినిస్ట్రేషన్ కోసమే ఖర్చు ఔతున్నది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- రోడ్సు ఐతేనేమి? దేశమును wake up చేయా లంటే రోడ్లు అత్యవసరం. అక్కడికి ఆఫీసర్లు వెళ్ళివచ్చుటకు రోడ్లు కావాలి గదా ?......

శ్రీ పి. సుందరయ్య :- రోడ్లుఉంటే వెళ్ళి దోచుకొనుటకు వీలౌతుంది. పిల్లల చదువుకొరకు గాని, భూముల కొరకుగాని ఏమీలేదు.

డాక్టర్ బి. గోలపారెడ్డి :- దోచుకొనే ప్రశ్నే లేదు. ఒకవ్యవసాయ శాఖ ఉద్యోగిగాని మరొకరుగాని జీపులో వెళ్ళివచ్చుటకు రోడ్లుఉండాలి. ఆఫీసర్లు వెళ్ళినప్పుడు ఆ మలేరియా ప్రాంతాలలో ఉండుటకు స్థలము ఉండవలయును గదా? కొండప్రాంతాలలో అడవిప్రాంతాలలో రోడ్లు చాలా అవసరం. తరువాత ఆఫీ సర్సుకు ఉండుటకు ఇండ్లుకూడా అవసరం, ఇవి అన్నీ జనతరువాత కావలసిన సదుపాయములు చేసుకోవచ్చును. రోడ్లకోసమేగదా ఖర్చుపెట్టేది? లేక ఆస్పత్రికే గదా? లేక మెడికల్ కాలేజికే గదా? అని అంటూ అంత అనాదరణగా చూస్తే ఏమీ లాభంలేదు. Tribal areas లో కావలసింది ముఖ్యంగా రోడ్లే. Forest produce ను మార్కెట్‌లోకి తీసుకవచ్చుటకు రోడ్లు అవసరం. అందువల్ల రోడ్సుదోచుకొనుటకు అని అనడం న్యాయమైన విషయంకాదు, అలాగే గత సం॥ లో 88 లక్షలు ఈ సంవత్సరం 130 లక్షలు షెడ్యూల్డు జాతులకు కేటాయించడమైనది. 1957_58 1958_59 లో 130 లక్షలు హరిజనులకొరకు కేటాయించడమైనది. Fainace department నుండి షెడ్యూల్డు ట్రైబ్సు, షెడ్యూల్డు, కాష్ట్సు క్రిమినల్ ట్రైబ్సు, బాక్వర్డు

తెప్పించుకొన్నాను. ఇక చాలా డిమాండ్సు వస్తవి. వాటిమీద స్థానికంగా ఉన్న విషయములను చెప్పుకోదలిస్తే చెప్పుకొనవచ్చును. నేను ఆ విషయాలను గురించి వివరముగా చెప్పనందుకు అపార్థము చేసుకోరని అనుకొంటున్నాను. ఆ విషయాలపై ఆ డిమాండ్లపై జరిగే చర్చలో మంత్రులు సమాధానము ఇవ్వగలరు. నేను జనరల్ విషయాలు కొన్ని చెప్పదలచుకున్నాను.

కొన్ని విషయాలపై దురదృష్టవశాత్తు కొంత ఉద్రిక్తమైన వాతావరణము ఈ నాల్గు దినములలో ఏర్పడింది. ఒక విధముగా అదినాకు సంతోషమునే కల్గించి నది. మనస్సులలో గుసగుసలాడుకునే బదులు ఎసెంబ్లీలో మాట్లాడటం, పత్రికలలో ప్రచురింపబడటం, మంత్రులద్వారా సమాధానాన్ని పొందటమే మంచిది. "మా కేదో అన్యాయము జరుగుతోంది, మా ఆశలు నిరాశలై పోతున్నాయి, మా ద్రవ్యం ఎక్కడికో పోతున్నది, వెనుకబడి ఉన్న మా పై అధికభారం పడుతోంది, మూలిగే నక్కపై తాటికాయ పడినట్లుగా వుంది మా స్థితి" అని మనసులలో అనుకొనే బదులు ఇక్కడనే సమాధానం పొందటము మంచిది. ఒకరిపై ఒకరికి అవిశ్వాసం ఏర్పడే బీజాలు వున్నాయేమో నాకు తెలియదు కాని అదికూడ ఒక విధంగా మంచి దనే నేను భావిస్తున్నాను. రీజినల్ కమిటీలు ఏర్పరచే విషయములో బొంబాయికి, మైసూరుకు కలగని అవకాశం పంజాబుకు, ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే కల్గినది. నాయకులందరు ఒప్పుకొన్న విషయమది. ఇది పూర్వం యింకో విధముగా పరి పాలించబడిన ప్రదేశము. ఇప్పుడు మరికొన్ని ప్రాంతములు వచ్చి కలిసాయి. కొందరికి కొన్ని అపోహలు వున్నాయి. వాటిని తీర్చటానికి రీజినల్ కమిటీలు ఏర్పడటం మంచిదనే భావిస్తున్నాను. కాని ఫిబ్రవరి 1వ తేదీననే ప్రెసిడెంట్ ఆర్డరు వస్తే యింకా ఏర్పరచలేదేమని, ఎన్నికలు జరుపలేదేమని విమర్శించటం న్యాయంకాదు. రీజినల్ కమిటీ రానందువల్ల సభ్యులకు అపారమైన నష్టం వస్తున్న దని నేను అనుకోను. కోర్కెలను తెలపటానికి ఎసంబ్లి వుంది. పత్రికలు వున్నాయి. ఫిబ్రవరి 1వ ప్రెసిడెంట్ ఆర్డర్ వచ్చినప్పటికి తగిన steps తీసికోవటం లేదని ఎవరో దానిపై శీతకన్ను వేస్తున్నారని, ఏర్పాటుకాకుండా వుండాలని చూస్తున్నారని" చెప్పటం భావ్యం కాదు. నిజంగా ప్రభుత్వానికే ఇష్టంలేకపోతే బొంబాయిలోను మైసూరులోను లేనిది ఇక్కడ మాత్రము ఎందుకు ఏర్పాటు చేయటం ? " అని చెప్పే వారిమే. రీజినల్ కమిటీ కావాలని అందరము కోరాము. అది ఏర్పడటానికి అంద రము ఒప్పుకొన్నాము. మంత్రి వర్గం తాత్సారం చేస్తున్నదని తలంచరాదు. సాధ్య మైనంత తొందరగానే సభ్యులు ఇండ్లకు పోయే లోపుగానే దానికి కావలసిన సరంజామా అంతా పూర్తి అవటం వారే చూడగలరని, ఆ డిమాండు వచ్చి నపుడు వివరంగా ముఖ్యమంత్రిగారు చెప్పగలరని మనవిచేస్తున్నాను. దానినిఏర్పాటు చేయనందువల్ల వచ్చే లాభంకాని యేర్పాటు చేసినందువల్ల వచ్చేనష్టంగాని ప్రభుత్వా

నికి లేదు. లాభనష్టములులేని విషయం. అందరు అంగీకరించిన విషయము. ప్రెసిడెంట్ ఆమోదించిన విషయము. దీనిని ఆలస్యం చేయవలసిన అగత్యం ఎవరికిలేదు తెలంగాణాకు సంబంధించిన విషయాలు దాని ప్రకారము చేసుకో వచ్చును. దానిలో కొన్నికొన్ని విషయాలు చర్చించరాదని ప్రెసిడెంట్ ఆర్డరులో వుంది. కాని దానికి సంబంధించిన విషయాలను సభ్యులు మంత్రివర్గానికి తెలుపుకో వచ్చును. తెలంగాణాకు ఏదైనా అన్యాయము జరుగుతున్నప్పుడు ఫైనాన్షియల్ మేటర్స్ వుండకూడదని ప్రెసిడెంట్ ఆర్డరులో వున్నప్పటికి కాన్స్టిట్యూషనల్‌గా కాకపోయినా, విషయాలను చెప్పుకొనే అధికారము మీకువుంది. మోటార్ వెహికిల్ టాక్సు ఆంధ్రలో ఎక్కువగావుంది. తెలంగాణాలో తక్కువగావుంది. ఒక్కసారి తెలంగాణాలో పెంచితే అంతభారాన్ని మోయలేకపోవచ్చు. ఆ విషయమును రీజనల్ కమిటీలో కాకపోయినా ప్రభుత్వానికైనా చెప్పవచ్చును. బొంబాయి అసెంబ్లీలో జీవరాజ్ మెహతాగారి బడ్జెటు స్పీచ్‌ను జాగ్రత్తగా చదివాను. దానిలో మనకు సంబంధించిన విషయాలు చాలా వున్నాయి. హైదాబాదునుండి పోయి బొంబాయిలో కలసిన జిల్లాలు కొన్ని వున్నాయి. అలాగే కర్నాటక జిల్లాలుకూడా వున్నాయి. అక్కడ ఎట్లా పన్నులు వేస్తున్నారని ఆ స్పీచ్‌ను శ్రద్ధగా చదివాను. మేముచేస్తున్న విధముగానే వారు చేస్తున్నారు. మనలను వారు అనుసరిస్తున్నారా? లేక వారినే మనము అనుసరిస్తున్నామా? అన్న అనుమానము కలుగుతున్నది. మనము ఎగ్రి కల్చరల్ ఇన్‌కంటాక్సు వేశాము. వారూ అదేవేశారు. తెలంగాణాకు సంబందించి పెట్రోల్ పన్నును. ఎక్కువ చేస్తున్నాము. అక్కడకూడా ఎక్కువ చేస్తున్నారు. ఎన్‌టర్‌టైన్‌మెంటు టాక్సు విషయం ఆలోచిస్తున్నాము. వారూ ఆలోచిస్తున్నారు. జ్యుడిషియల్ స్టాంప్సుపై ఆలోచిస్తున్నాము. వారూ ఆలోచించబోతున్నట్లు తెలిపారు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం):- వారు, వీరు అనుకొనే ఒక విధంగా చేస్తున్నారేమో!

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- అలాచేస్తే బాగానే ఉంటుంది. అప్పుడప్పుడు కలుసుకొంటూ చేస్తే యింకా బాగుంటుంది. కాని కలుసుకోవడానికి సందర్భపడటం లేదు. మనము ఏది ఆలోచిస్తున్నామో వారూ అదే independent గా ఆలోచిస్తు న్నారు కాని అనుకొని చేయుటలేదు. నరసింహారావుగారు "మా తెలంగాణాపై పన్నులు రుద్దుతున్నారు" అని చెప్పారు. "రుద్దుతున్నారు" అనేమాట డ్రాయింగ్ రూంలో అంటే ఏమైనా బాగుంటుందేమో కాని ఎసెంబ్లీలో ఆ మాట కర్ణకఠోర ముగా వుంది. మామూలుగా ఉపయోగించే మాటను ఎసెంబ్లీలో వుపయోగించకుండా వుంటే బాగుంటుందని మనవి చేస్తున్నాను. తెలంగాణాకు సంబంధించిన విషయా లనే ఎక్కువగా డాక్టర్ చెన్నారెడ్డిగారి మొదలు పుచ్చలపల్లి సుందరయ్యగారి వరకు

అందరు ప్రస్తావించటం జరిగింది. దీనివల్లకూడా మంచే వస్తుందని అనుకొంటున్నాను. ప్రతిదానిలో కూడా మంచినే చూడాలని నేను అనుకొంటూ వుంటాను. ఈ నాల్గురోజుల మూలంగా దూరంగాపోయే వారు దగ్గరగా రావటానికి వీలు అయిందేమోనని నేను అనుకొంటున్నాను. దాగారెడ్డిగారు ఒకపద్యం చదివారు. «اس گھر کو آگ لگ گئی گھر کے چراغ سے» ఈ కొంప లోని దీపంవల్లనే ఈ కొంప తగలబడి పోయింది అని దాని భావము. ఎవరివల్ల ఎవరి కొంప మునిగిందో, ఏ కొంపలోని దీపంవల్ల ఏ కొంప తగులబడిపోయిందో నాకు తెలియదు. కాని ఎవరి కొంప తగులబడలేదని నేను చెబుతున్నాను. తెలంగాణకు ఏ అన్యాయము జరుగదని, వారి ద్రవ్యము ఎక్కడికి పోదని చెబుతున్నాను. ఎకౌంటెంట్ జనరల్‌గారు ఆశ్చర్యపడుతు "మాకు ఇబ్బంది కలుగచేస్తున్నారు" అని అన్నారు. తెలంగాణాకు వచ్చిన ప్రతి దమ్మిడి తెలంగాణాకే ఖర్చు చేస్తామని నా బడ్జెటు స్పీచ్‌లో చెప్పాను. క్రిందటి సంవత్సరం మార్చిలో బడ్జెటు ప్రసంగము చేస్తూ వెంకట్రావుగారు తెలంగాణాను, ఆంధ్రను 'ప్రత్యేకంగా' చెప్పలేదు. ప్రత్యేకంగా ఉండకూడదనే వారి ఉద్దేశ్యము. "యింకా ఏమి తెలంగాణా, ఏమి రాయలసీమ, 20 జిల్లాలు ఒక్కటే. ఎవరు ఎక్కడ క్షామ పీడితులైనా వారికి సహాయం చేయవలసినదే. దానికి బడ్జెటుతో నిమిత్తము లేదు. తెలంగాణా రాయలసీమ ఉత్తర సర్కారులు అనే మాటలు ఇకలేవు" అని విశ్వసించేవారు వెంకటరావుగారు. ఇటువంటి దృక్పధమును వారు అవలంబిస్తూ అందరిచేత అవలంబింపచేస్తూ యున్నారు. చాలా సంతోషించదగిన విషయం. కాని నేను కొంచెము కన్సర్వేటివ్‌ను, మనం రీజనల్ కమిటీని ఒప్పుకున్నాము. అక్కడక్కడ అపోహలు ఉన్నాయి. "మీ జిల్లాలనుంచి సేల్సుటాక్సు ల్యాండు రెవిన్యూ వగైరాల మీద యింత ఆదాయం వచ్చింది. ఇంత ఖర్చు పెడుతున్నాం" అని వారికి లెక్కలు చూపెడితే బాగుంటుందని, అట్లా కొన్ని సంవత్సరములు చేసినట్లయితే యీ అపోహలకు ఆస్కారం ఉండదని, separate చేసి తెలంగాణా లెక్కలను వేరే చూపించాను. దీనివల్ల ఐక్యతకు భంగం రావలసిన అవసరం లేదు.

నేను వ్యక్తిగతముగానే కాకుండా, ప్రభుత్వం తరపునుంచి కూడ తెలంగాణా వారికి హామీ యిస్తున్నాను. తెలంగాణాలో యేమాత్రం మిగులు ద్రవ్యం ఉన్నప్పటికీ కూడ, — ఒక నయాపైసా అయినప్పటికి, — అది తెలంగాణా అభ్యుదయం కోసమే వినియోగం అవుతుంది. ఆ విషయంలో ఎలాటి అభిప్రాయ భేదాలు లేవు. తెలంగాణాలో మిగులు ఉన్నదని అంటున్నారు. ఈ మిగులు, తరుగుల విషయంలో కొంత తమాషా ఉంటుంది. కాని యిందులో గారడీ యేమీలేదు. 1956 నవంబరులో ఆంధ్రప్రదేశ్ వచ్చింది. అదే 1956 మార్చిలో హైదరాబాదు-బడ్జెటును ప్రవేశ పెడుతూ ఆర్థిక మంత్రి శ్రీ వినాయికరావు విద్యాలంకార్‌గారు 4 కోట్ల · 30 లక్షలు

నష్టం వస్తున్నదని తమ బడ్జెట్టు ప్రసంగంలో చదివినారు. నా బడ్జెట్టు ప్రసంగం ఇంగ్లీషు ప్రతిలో, ఆరవ పేజీ చూచినట్లయితే మొదటి 7 మాసాలకు యిట్లా యున్నది. According to the latest available information, the Revenue and expenditure of the composite Hyderabad State for the first seven months of 1956–57 amounted to 13 crores and 16 crores respectively. This reveals Revenue deficit of 3.58 crores of rupees. హైదరాబాదుకు సంబంధించిన మొదటి ఏడు మాసాలలో 4 కోట్ల 30 లక్షలు నష్టం వస్తుందని వారు అనుకొన్నారు. మొదటి ఏడు మాసాలలో తెలంగాణాకు సంబంధించి 3 కోట్ల 58 లక్షలు నష్టం వచ్చింది. కాని మొత్తం హైదరాబాదు స్టేటుమీద 5 కోట్ల పై చిల్లరకు deficit వచ్చింది. అందులో 60% తెలంగాణాకు వస్తుంది.

శ్రీ పి. సుందరయ్య :— మొదటి ఏడు మాసములకు మొత్తం హైదరాబాదు స్టేటుకు 3 కోట్ల 58 లక్షలు, అందులో 60o/o అంటే రెండుకోట్ల వరకు ఉంటుంది.

డాక్టర్ బి: గోపాలరెడ్డి :— నాకు తెలిసినంతవరకు యిక్కడ ఉన్న విషయం చెప్పాను. Whole thing had to be done in hurry. Verify చేస్తున్నాను. అక్కడ wording సరిగా లేదు. నేను దానిని రికన్సైల్జు చేశాను. Composite Hyderebad State కు 5 కోట్లపై చిల్లర నష్టం వచ్చినది. అందులో తెలంగాణాకు సంబంధించి మాత్రం మూడు కోట్ల పైచిల్లర. ఈ నష్టం ఎలాగ వచ్చింది, దీనికి కారణాలు ఏమిటి అన్నది వేరే సంగతి. కాని అకౌంటెంటు జనరల్ యిచ్చిన లెక్కల ప్రకారం నేను చెబుతున్నాను. తరువాత 5 మాసాలకు, ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తర్వాత 41 లక్షలు Surplus వచ్చింది. 1956–57 సంవత్సరంలో 43 లక్షలు Surplus వచ్చింది. మొత్తం మీద ఎంత మిగులు ఉన్నదో మనం లెక్కలు వేసుకోవచ్చును ఇందులో గారడి ఏమీలేదు. Accountant-General is the custodian of our Accounts. ఆయన Government of India మనిషి. అందులో యేమీ అన్యాయం జరగడానికి వీలు ఉండదు. కావలసివస్తే తెలంగాణాకు సంబంధించిన లెక్కలు వారి దగ్గర తీసుకోవచ్చు. నేను పోయిన సారి ఒక విషయం చెప్పాను. దానిని కొంత మంది మిత్రులు misunderstand చేసుకొన్నారు. తెలంగాణాకు సంబంధించి మిగులు అనేది యేమైనా ఉంటే, అవి అన్నీవేరే యుంచి, మనం మూడవ పంచవర్ష ప్రణాళికను వేసుకొనేటప్పుడు ఈ మొత్తాలను తెలంగాణా అభివృద్ధికి వినియోగించుకోవచ్చు. అంతేగాని యే సంవత్సరానిది ఆ సంవత్సరమే ఖర్చు పెట్టాలంటే, ఎప్పటికప్పుడు ప్లానును మార్చ వలసివస్తుంది. అట్లా మార్చడానికి ప్లానింగ్ కమిషన్ వారు కూడ ఒప్పుకోరు. తెలంగాణాకు సంబంధించినంత వరకు 56 కోట్ల రూపాయలు ప్లాను ఉన్నది. అది హైదరాబాదు

ప్రభుత్వం వారి హయాములోనే జరిగింది. అంటే ఆంధ్ర ప్రదేశ్ రాకపూర్వమే జరిగిన విషయమని మనవి చేస్తున్నాను.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి (భువనగిరి): హైదరాబాదు సిటీని ప్రత్యేకంగా తెలంగాణాలో వేయడం యేమి న్యాయమో వివరించండి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నెమ్మదిగా వస్తున్నాను. అందుచేత Practical గా చెబుతున్నాను. ఇట్లా చెబుతున్నప్పుడు కొంతమందికి నిరుత్సాహంగా ఉండవచ్చు. రెండు మూడు సంవత్సరాలు wait చేసియున్నట్లయితే మీరే తెలుసుకోవచ్చు ఇందులో యెవరికీ అన్యాయం జరుగుటలేదని యింకొకసారి మనవిచేస్తున్నాను. ప్లానులో ఉన్న ప్రకారం అంతా జరుగుతోంది. Public Health School వాల్తేరులో పెట్టాలని ప్లానులో ఉన్నప్పటికి, హైదరాబాదులో పెట్టినట్లయితే బాగుంటుందని, యిక్కడకు మార్చాము. కావలసివస్తే చిన్న చిన్న adjustments ను చేసుకోవచ్చు. మొత్తం ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి రెండు వందలో, రెండు వందల ఏభై కోట్లో ప్లాను ఉంటుంది. ప్లానింగు కమిషన్ ఆమోదంతో. తెలంగాణాకు weightage యివ్వవచ్చు అది న్యాయమైన విషయమే।

శ్రీ పి. సుందరయ్య:-ఇది యే Constitution లో, ఏ చట్టంలో ఉన్నది ?- తెలంగాణా ఆదాయాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు పెట్టకూడదని ఉన్నదా? అసలు ప్లానే ఎప్పటి కప్పుడు మారి పోతూన్నప్పుడు, యెందుకు ఖర్చు పెట్టకూడదు ? దానికి వచ్చే ఆటంకం ఏమిటి ?

డాక్టర్. బి. గోపాలరెడ్డి:- సుందరయ్యగారికి ప్లానింగ్ కమీషన్ మీద అట్టే విశ్వాసం లేదు. వారి దృక్పథానికి, ప్లానింగ్ కమీషన్ దృక్పథానికి చాలా తేడా ఉన్నది. "మన ఆంధ్రదేశంనుంచి, డబ్బు పీడించుకొని తీసుకొని పోతున్నప్పుడు, ఎందుకు కేంద్రప్రభుత్వము సహాయం చేయదు" అన్న ధోరణిలో ఉండే టటువంటి వారు సుందరయ్యగారు. అందువల్ల నేను కేంద్రప్రభుత్వానికి ముబారకులు. Congratulations యివ్వడం ఆయనకు యిష్టం ఉండదు. కేంద్రప్రభుత్వమంటే పరాయి ప్రభుత్వం కాదు. అది మన ప్రభుత్వం. మనం ఎన్నుకొని పంపిన ప్రజా ప్రతినిధులే అక్కడ యున్నారన్న సంగతిని గుర్తుంచుకోవాలని కోరుతున్నాను.

శ్రీ పి. సుందరయ్య:- ఆంధ్రనుంచి ఒక్క కేబినెట్ మినిష్టరుకూడా లేదే?

డాక్టర్. బి. గోపాలరెడ్డి:- లేకపోతే లేకపోవచ్చును.

శ్రీ పి. సుందరయ్య:- ఢిల్లీ ప్రభుత్వంలో ఒక్క సెక్రటరీగూడ లేదు. ఈ ప్లానులు, ఈ ప్రణాళికలు అన్నీ ఎందుకూ పనికిరానివి.

శ్రీ కె. వెంకటరావు:- సుందరయ్యగారు లెక్కలు మరచిపోతున్నారు. పుల్లారెడ్డిగారు డిఫెన్సు కార్యదర్శిగా పనిచేస్తున్నారు, వారి క్రింద 250 కోట్ల రూపాయలు ఉంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- శివశంకరంగారు P. W. D. లో ఉన్నారు. ఆయన ఆంధ్ర కేడరులో వారే। తరువాత పబ్లిక్ సర్వీస్ కమీషన్ చైర్మన్ ఉన్నారు. భూతలింగంగారు Commerce and Industries లో ఉన్నారు. ఇంకా చాలామంది ఉన్నారు. నా దగ్గర సివిల్ లిస్టు యున్నది. టైము లేదు. లేకపోతే చదివేవాణ్ణి.

శ్రీ పి. సుందరయ్య:- దామాషా ప్రకారం ఎంతమంది ఉన్నారో చెప్పమంటున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- చాలామంది ఉన్నారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:- ఇంతమంది యున్నారు కాబట్టే మనకు ఎరువుల ఫ్యాక్టరీ, కోచ్ ఫ్యాక్టరీ లేకుండాపోయింది.

శ్రీ కె. వెంకటరావు:- గోపాలకృష్ణయ్యగారు పోయినదానిని గురించి విచారించడం ఎందుకు ? ఉన్నదానిని సంపాదించుకోలేని స్థితిలో ఉన్నప్పుడు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నా ఆనందభైరవి ఆలాపనకు కొంచెము భంగము వస్తున్నదేమో అనుకొంటున్నాను. కేంద్రప్రభుత్వంలో మనవారు ఉన్నా, లేకపోయినా, మనకు వచ్చేది వస్తోనే యున్నది. ప్లానింగు కమీషనువారు కొన్ని కొన్ని నియమాలకు, పద్ధతులకు బద్ధులై పనిచేస్తున్నారు. వారు చేయవలసిన సహాయం చాలా యున్నది. 30కోట్ల రూపాయలలోనూ 18 కోట్ల రూపాయలు మనకు గ్రాంటుగా కాకపోయినా, అప్పుగా అయినా యివ్వవలసియున్నది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ):- 30 కోట్ల రూపాయలలో లోనూ ⅔ వంతు కేంద్రప్రభుత్వం భరించాలికదా ? అందులో రెండు కోట్లు యెందుకు తగ్గించారు. ఈ సంగతి పత్రికలలో వచ్చింది, నేను చూచాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- ⅔ వంతు కేంద్రప్రభుత్వం యివ్వాలి. ⅓ వంతు రాష్ట్రప్రభుత్వం పెట్టుకోవాలి అన్న నియమము యెక్కడా లేదు.

బొంబాయిరాష్ట్రం రు. 170 కోట్లవరకు schemes పంపిస్తే, వారికి రు. 40 కోట్లకంటే తక్కువే యిచ్చారు. రు. 75 కోట్ల schemes వారికి sanction అయాయి. కానీ వారికి రు. 40 కోట్లకంటే తక్కువే యిచ్చారు. National Development

Council లో కాని, ముఖ్యమంత్రుల సమావేశాల్లో కాని, కేంద్రప్రభుత్వం 2/3 వంతు, రాష్ట్ర ప్రభుత్వాలు 1/3 వంతు పెట్టుకోవాలనే నిర్ణయం నాకు తెలిసినంతవరకు జరగలేదు. మన శక్తి ఎంత వుందో, ఎంత taxation వేయగలమో, small savings నుంచి ఎంత తీసుకొని రాగలమో ఎంత loans raise చేయగలమో ఇవన్నీ వారు పరిశీలనచేసి schemes మొదట 5 సంవత్సరాలకు fix చేస్తారు మళ్ళీ దానిని year by year ఫేజింగ్ చేస్తారు. మేము, మంత్రివర్గం అంతా రు. 43 కోట్లు— 1/3 of the original plan వుండాలని pass చేసి, కేంద్రానికి సిఫార్సు చేశాం. దీనిపైన కేంద్రం రు. 30 కోట్లకు schemes అంగీకరించి, తన వాటా క్రింద రు. 18 కోట్లు యిస్తున్నారు. తక్కిన రు. 12 కోట్లు మనం పెట్టుకోవాలి. ఈవిధంగా అన్ని రాష్ట్రాలకు జరిగింది. అందరూ నిరుత్సాహం చెందారు. Bombay, West Bengal, Madras రాష్ట్రాలకు వారనుకొన్న దానికన్న కూడా తక్కువ వచ్చింది. B. C. Roy, Subramanyam గార్లకు ఆగ్రహాలు వచ్చాయి. మా ఆశలన్ని నిరాశలై పోయాయన్నారు. వారికి చెప్పవలసిన విషయాలన్నీ చెప్పాము. వారు చెప్పే విషయాలను కూడా మనం అర్థం చేసికొంటే బాగుంటుంది. అలా అర్థం చేసుకోకుండా మన దృక్పథంలోనే "మీరు మాకు సహాయం చేయడంలేదు, అంతా అధర్మం చేస్తున్నారు" అని ప్లానింగ్ కమీషన్‌ను, అక్కడి ఆర్థికమంత్రిని, ప్రధానమంత్రిని అన్న తరువాత వచ్చే లాభం ఏమీలేదు. కేవలంమన హృదయాక్రోశాన్ని వెళ్ళబుచ్చుకొంటె దానివల్ల ఏమీ జరగదు. ఎక్కడ ఏమి చెప్పాలో అంతా మేము చెబుతున్నాము. ఈ విషయంలో సుందరయ్యగారు ఏమీ పొరపాటు పడనక్కరలేదు. ఈ విషయాలన్నీ పత్రికలలో ప్రకటించి, ఆంధ్ర ఆర్థికమంత్రి, ముఖ్యమంత్రి, కేంద్రఆర్థికమంత్రి తోను, ప్రధాన మంత్రితోను ఈ మాదిరిగా మాట్లాడారని వెల్లడి చేయడం న్యాయంకాదు. అక్కడ వుండేవారికి ఎంత సునిసితంగాను, ఎంత కఠినంగాను, ఎంత నచ్చచెప్పేట్లు చెప్పాలో అంతా చెబుతున్నాము. వారు చెప్పే విషయాలను కూడా మనం అర్థం చేసుకోవాలి. పెద్దలు చెప్పేది వినాలి. ఆఖరుకు కేరళ ప్రభుత్వంకూడా అంతేచేసింది. కేంద్ర ఆర్థికమంత్రి గారితో నేను private గా మాట్లాడినప్పుడు వారు చెప్పింది ఏమిటంటే రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వాలే మమ్మల్ని ఎక్కువ కష్టపెడుతున్నాయి, కేరళ కమ్యూనిష్టు ప్రభుత్వానికి అన్నీ explain చేయగానే నంబూద్రిపాద్, అచ్యుతమీనన్ గార్లు అందరికంటే ముందే ఒప్పుకొని all right, we will accept what you say అని చెప్పారు.

శ్రీ పి. సుందరయ్య:— కేరళ మంత్రివర్గం ఏమి అంగీకరించినా అంగీకరించకపోయినా ప్రస్తుతానికి వారిని defend చేయడానికి నేను ఇక్కడలేను. మన ఆంధ్రదేశానికి కావలసింది మన ఆంధ్రప్రభుత్వం దెబ్బలాడుతోందా లేదా అనేది ఇక్కడి సమస్య. నేను ఆ పదవిలో వుంటే ఏమిచేసేవాడినో ఇప్పుడెలా చెప్పగలం.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- దెబ్బలాడటం అనేదానికి అర్థం ముష్టియుద్ధం కాకపోవచ్చు. వ్రాతమూలకంగానూ, విన్నపాల మూలకంగానూ ఎంతవరకు చెయ్యాలో, అంతా మేము చేశామని స్పష్టంగా చెప్పగలను. ముష్టియుద్ధానికి మాత్రం మేము సిద్ధంగా లేము.

*Mr. Speaker* :- No interruptions please.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- తెలంగాణాకు సంబంధించినంతవరకు దాని ద్రవ్యం దానికే ఖర్చుచేయబడుతుందని reiterate చేస్తున్నాను. కొత్తగా సుందరయ్యగారు యిప్పుడు ఇంకో 3rd division ను తీసుకు రావడానికి ప్రయత్నం చేస్తున్నారు. 1. ఆంధ్ర 2. తెలంగాణా minus హైద్రాబాదు 3. హైద్రాబాదు సికింద్రాబాదు పట్టణాలు. ఇక ఈ 3 రకాలుగాను లెక్కలు చూపాలని శ్రీ సుందరయ్యగారు చెప్పడం దానిని శ్రీ నారాయణరెడ్డిగారు బలపరచడం చాలా ఆశ్చర్యంగా ఉంది అనుకొంటున్నాను.

*Sri R. Narayana Reddi*:- How can we consider Hyderabad to be a city of Telangana only? I want a straight answer.

*Dr. B. Gopala Reddi* :- As far as Secretariat,, High Court and Public Service Commission is concerned it is the capital for Andhra Pradesh.

ఇవన్నీ ఆంధ్ర ప్రదేశ్ అంతకు సంబంధించినవే. కానీ హైదరాబాద్‌లో వున్న కళాశాలలు, ఆసుపత్రులు, Registrar Offices మొదలైనవి తెలంగాణాకు సంబంధించినవే. బెజవాడ నుంచికాని, Vizag నుంచికాని ఎవరూవచ్చి ఈ Hospitals లో treatment పొందడంలేదు

శ్రీ ఆర్. నారాయణరెడ్డి :—నేను యింకో ప్రశ్న వేస్తున్నాను. వచ్చే 5 సంవత్సరాలలోను Hyderabad City Development ఖర్చు తెలంగాణా మీదవేయడం ఏమి న్యాయం? హైదరాబాద్ Capital city గా వచ్చే 5 సంవత్సరాల్లోను పూర్తిగా develod అవుతుంది. యిదివరకే develop అయింది. అట్టి సందర్భంలో హైద్రాబాద్ ఐరావతాన్ని కేవలం తెలంగాణా మీదేవేయడం ఏమి న్యాయం?

మిస్టర్ స్పీకర్ :—మీరు మీరు అని అనుకోకుండా మాట్లాడాలి. Both of you please address the Chair.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—ఇప్పుడు హైద్రాబాద్‌లో ఉద్యోగస్థులకు కట్టబడుతున్న Housing Schemes ఖర్చు తెలంగాణామీద మోపబడటంలేదు, అది

capital expenditure, ఆంధ్రప్రదేశ్ అంతకు సంబంధించింది. హైదారాబాద్ ఒక్కదాన్ని develop చేశామనేమాట నిజమే. యిక్కడ అనేక Educational and Medical Institutions వున్నాయి, కాని యింతవరకు జిల్లాల్లో ఏమీజరగలేదు. మేము తెలంగాణామీద యింత ఖర్చుపెడుతున్నాము అనిచెప్పి హైదారాబాద్ పట్టణం మీద ఖర్చుపెడితే అది నల్లగొండ లేక మహబూబ్‌నగర్ జిల్లావారికి ఏమి లాభం? అలాంటి సందర్భంలో హైదారాబాద్‌కు వచ్చే ఆదాయాన్నంతా వేరుచేయాలి. అలా చూస్తే తెలంగాణా జిల్లాకు ఎక్కువ వుండదనుకొంటాను. హైదారాబాదు ఆదాయం, ఖర్చు పోల్చిచూస్తే తెలంగాణా జిల్లాలకు ఏమీ మిగలదు.

శ్రీ పి సుందరయ్య :-వెనుకబడిన జిల్లాలకు వచ్చే ఆదాయం సరిపోక పోతే, మిగులు ప్రాంతాలనుంచి తీసుకువచ్చి పెట్టాలి.

డాక్టర్ బి గోపాలరెడ్డి :-హైదారాబాద్ విషయం వేరుచేసిచూస్తే యిప్పుడు తెలంగాణా జిల్లాలకు land revenue Rs. 3 crores and odd ఖర్చు 6 crores and odd forest మీద 6-7 crores, Sales Tax 2 crores. తెలంగాణా జిల్లాలోని Sales Tax చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగావుంది. ఒక్కొక్క జిల్లాకు 4-5 లక్షల కంటె ఎక్కువ రావడంలేదు. హైద్రాబాద్ పట్టణంలో ఆదాయం చాలా ఎక్కువగా వుంటుంది. Motor Vehicles, Petrol, entertainment వీటి అన్నింటిమీదా city లోనే ఆదాయం ఎక్కువ. దానివల్ల తెలంగాణా జిల్లాలకు లాభిస్తుందని నేను అనుకోను. కాబట్టి opposition వారు చెప్పిన మొదటి సిద్ధాంతంతో నేను ఏకీభవిస్తాను. తెలంగాణా వారి ఆదాయంలో ఒక్క నయాపైసా మిగిలితే అది వారికోసమే ఖర్చు పెట్టబడుతోంది. ఏమన్నా మిగులువుంటే దానిని వారికేతప్ప యింకొకరికి ఖర్చుపెట్టమని హామీ యిస్తున్నాను. యిప్పుడు వారికోసం ఎక్కువ ఖర్చు పెట్టాలి. మనం అనుకొన్న plan ప్రకారంగా తెలంగాణాను అభివృద్ధి పరచిన తరువాత కావాలంటే వెయిటేజ్ ఎప్పుడివ్వాలో అప్పుడు ఇస్తే మంచిది. కాని యిప్పుడు ఉన్నదానిని up-set చేయడం న్యాయం కాదని చెబుతున్నాను. ఈ సందర్భంలోనే ఒక చిన్న మిస్‌ఎక్స్‌ప్రెషన్ తీసివేస్తే మంచిదనుకుంటున్నాను. "ఆంధ్రి అంతా అభివృద్ధి అయింది, తెలంగాణా మాత్రం వెనుకబడి వుందని అనడం, ఎంతో general గాను, సూపర్‌ఫిషియల్‌గాను వుండే కాని వాస్తవమైన విషయంకాదు. మద్రాస్‌లో ఉన్నప్పుడు తెలుగు జిల్లాల్లోనే percentage of illiteracy తక్కువగా వుండేది. ఏవోకొన్ని తాలూకాలు, డెల్టాప్రాంతంలో యిటు బెజవాడ, అటు తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో education బాగుంది. ఆంధ్ర ప్రాంతంలో 3/4 భాగం మా తెలంగాణాకు పోలినదే. నాజిల్లాలో 13 తాలూకాలున్నాయి. అందులో 9-10 తాలుకాలు తెలంగాణాలో కూడా లేనంతటి దారిద్ర్యా

న్ని అనుభవిస్తున్నాయి. ఈనాడు మౌలాసాహెబ్ గారి constituency అంతటిది నాకు తెలిసినంత వరకు ఆంధ్ర ప్రదేశ్‌లో లేదని చెబుతున్నాను, అది అంత difficult constituency.

శ్రీ పి. సుందరయ్య:— అదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్, ఉట్నూర్ వంటి వెనుక బడ్డ ప్రాంతాలు ప్రపంచంలో మరెక్కడా వుండవు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- రాయల సీమలో అనుకున్నటువంటి నీటి పారుదల స్కీములు పూర్తి అయిపోయినప్పటికినీ, ఎంతో భూమికి నీటిపారుదల సౌకర్యములు వుండవు 62 % of the area will not be covered by any irrigation scheme. అక్కడకు నీళ్ళు తీసుకొని రావడానికి వీలులేదు. తుంగభద్ర ఎగువ కాలువలు త్రవ్వించి నప్పటికినీ projects కట్టించినప్పటికినీ ఏమి చేసినప్పటికినీ 38% లేక అంతకు తక్కువగానే irrigate చెయ్యవచ్చు. కేవలం వర్షాలపై ఆధార పడవలసిన ప్రాంతాలు చాలా ఉన్నాయని త్రివేదిగారు చెప్పినట్లు జ్ఞాపకము. ఆ మాదిరిగా తెలంగాణా అంతా వెనుక బడిపోయిందనీ, ఆంధ్రలో ఐశ్వర్యము తాండవము ఆడుతున్నదనీ, అనుకోవడం న్యాయం కాదు. అక్కడకూడ ఎన్నో ఇబ్బందులు ఉన్నాయి. Density of population అక్కడ చాల ఎక్కువగా ఉంది. ఎవరో కొద్దిమంది మాత్రం భూస్వాములు ఉన్నారు. కేవలం భూమి మీదే ఆధారపడుతున్న వ్యవసాయ కూలీలుకూడ ఉన్నారు. వారికి కూడ ఎన్నో సౌకర్యాలు కలుగజెయ్యాలి.వచ్చగా ఉన్నంత మాత్రాన ఆంధ్ర అంతా ఐశ్వర్యంగలిగి ఉన్నదని, తెలంగాణ వెనుకబడి పోయిందని అనుకోవడంచాల పొరపాటు. Madras కోస్తాలో ఆంధ్ర ప్రాంతం most backward area. అలాంటి backward area ను పచ్చగా ఉంది అనుకోవడం. అక్కడ ఖర్చు పెట్టకపోయినా పరవాలేదనడం, ఆ డబ్బుఅంతా తెలంగాణాకు తరలించ మనడము, న్యాయమైన విషయంకాదు. తెలంగాణా ద్రవ్యం, అక్కడ ఖర్చు పెట్టాలనే ఉద్దేశ్యం మాకులేదని మొదటనే చెప్పాను. ఆంధ్ర చాల advanced region. అనుకోవడం చాల పొరపాటు. Roads లేని తాలూకాలు ఎన్ని ఉన్నాయో, నాకు బాగా తెలుసును. Chittor district లో అసలు Major irrigation కు possibility లేనే లేదు. ఆ జిల్లాలో ఏమి చెయ్యాలను కొన్నప్పటికీ. తుదకు ఏమీ చెయ్యలేకుండా ఉన్నాము. వాళ్ళకి కూడ ఏదో చెయ్యక తప్పదు. 15 మాసాలు అయిపోయింది. ఇంకా ఏమీ జర గలేదే, ఇదేనా మేము అనుకొన్న విశాలాంధ్ర, ఇవేనా మేము కనిన కలలు, అని కూడ కొందరు అసావేరి రాగం పాడారు. కాని ఇది వాళ్ళు అనుకున్నంత సులభంగా పోయే దరిద్రము కాదు. దశాబ్దాలనుంచి, శతాబ్దాలనుంచి, మనకు వారసత్వంగా వస్తున్న ఈ సమస్యలు అన్నీ రెండు సంవత్సరాలలోనో, లేక రెండు పంచవర్ష ప్రణా ళికలలోనో తీరే సమస్యలు కావు. అట్లు Srikakulam, Vizag, Rayalseema

లలో ఇంకా ఎన్నో సదుపాయాలు కల్గించినా ఈ షట్కోణ్ త్రయు అవి ముందుకు పోతున్న భాగాలు అని అనుకోవడానికి వీలులేదు. అటువంటి అధఃపాతాళంలో ఉన్న దేశాన్ని ఏమి చేసినప్పటికినీ, ఎంత ఖర్చు చేసినప్పటికినీ, అది సముద్రంలో ఒక బిందువు మాదిరిగానే కనబడుతుంది. మా గ్రామాలకు ఏమి చేశారు? మా తాలూకాకు ఏమిచేశారు? అనేమాటేగాని "ఏదోచేశారు మేము సంతోషిస్తున్నాము, ఇదిగో ఇదిగూడ చెయ్యండి" అని చెప్పేవాడు ఇంతవరకూ మాకు కనబడడంలేదు. ఎక్కడికి పోయినప్పటికి కూడ ½ dozen కోరికలకు తక్కువ కాకుండా కోరుతూ ఉంటారు. కాబట్టి దీనికి ఏవిధమైనటువంటి short cuts లేవు దీనికి క్రమేపిపంచవర్ష ప్రణాళికమాదిరిగా వేసుకొని. Officer ల ద్వారా ఒక నూతనమైన spirit తో, ప్రయత్నము చేసుకొని నిర్విఘ్నంగా పనులు సాగించుకోవాలి గాని దొంపరపడి ఆక్రోశపడి, దూషించి సాధించుకోవాలి అనేది ఇక్కడ ఏమిలేదు. అది ప్రజలకు తేనిపోని చిత్తవైకల్యం కలిగించడమే కాని, దానివల్ల వచ్చేలాభం ఏమాత్రంలేదు. ఈ ప్రభుత్వంలోకూడ కొన్ని సాధక బాధకాలు ఉన్నాయి. ఏమీలేవనుకొని అంబరవీధిలో విహరిస్తే ప్రయోజనం లేదు కొన్ని difficulties ఉన్నాయి అంతేగాక ప్రతి విషయంలోను ప్రభుత్వాన్ని నిందిస్తే ఏమి ప్రయోజనం?

"Estimates Committee వారు మేము వెళ్ళి తుంగభద్రా కాలవ అంతా దర్యాప్తు చేసి, దీనిలో జరుతున్న irregularities, 8 నెలల క్రితమే గవర్నమెంటు వారికి రిపోర్టు చేశాము, ఇంతవరకు ఆ విషయమై ఏమిచేసేరో తెలియదని" Opposition Leader గారు చెప్పారు. అది వేరేవిషయం ఒక వేళ తొందరపడి చేయిస్తామని ఎవరైనా ఉద్యోగస్తులు ముందుకుపోతే, నీవుప్రభుత్వ Sanction ఎందుకు తీసుకోలేదు? ముందుగా estimates వంపించావా? Administrative Sanction పొందేవాలేదా" అని ఒక వైపు ఆ Heads of department అడుగుతూ ఉంటారు. ఇంకొక వైపు, డబ్బును Budget లో Provide చేసినా, మీరు ఖర్చు పెట్టలేకుండా పోతున్నారని ఇంకొక Head of the department ను అడుగుతున్నాము. దీనిలో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. క్రమేణా సరి దిద్దుకోవలసిందే గాని, ఒక్క సారి, యీ యంత్రాంగాన్ని మరమ్మతు చేసి, greese రాసి యేదో చేస్తామంటే జరిగే వ్యవహారం కాదు ఇది.

ఇక ఈ short fall in Telangana అనే విషయం ఎక్కువగా వచ్చింది. ఇది ఈ నాటిది కాదు. అందుకనే గత సంవత్సరం యొక్క చరిత్ర చెబుదామను కుంటే, సుందరయ్య గారు మొదటనే anticipate చేసి, ఆక్షేపించారు కూడా! దానిలో వాస్తవికమైన ఇబ్బందులు కొన్ని ఉంటడంవల్ల, అనుకున్నంత త్వరితంగా, Assembly pass చేసినా కూడ వెంటనే ఖర్చు కాకుండ కొన్ని కొన్ని విషయాలలో

అలాగ ఉండిపోతుంది. ఈ Criticism వచ్చిన తరువాత ముఖ్యంగా D. P. I ని ఈ short fall విషయమై అడిగాను.

ఇవన్నీ ఒక దురుద్దేశ్యంతో జరిగినవని గాని, లేక తెలంగాణా అభివృద్ధిని చూచి సంతోషించే వాళ్ళు లేరని గాని, అనుకోవడం పొరపాటు. వీటిల్లో ఒకరకమైన draw backs ఉన్నాయి. ఇలా కొంత కాలం నుంచి వస్తున్న సాంప్రదాయం గనుక అనుకున్నంత త్వరితంగా ఖర్చు పెట్టలేకుండా పోతున్నాము. ఇంతకు ముందుకన్నా కూడా ఇప్పుడు పని బాగా జరుగుతున్నది. కాని Short fall కూడా ఉన్నది. దానికి మేముకూడా అంగీకరిస్తున్నాము. ఉదాహరణకు Education Department తీసుకోండి. 1955–56లో హైదాబాదు ప్రభుత్వం ఉన్నప్పుడు 3 కోట్ల 50 లక్షల రూపాయలు ఖర్చు పెట్టారు. 1956–57లో 3 కోట్ల 57 లక్షల రూపాయలు ఖర్చు అవుతుందని అనుకుంటున్నాము. ఇప్పుడు Revised estimates లో 4 కోట్ల 40 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. అంతకు ముందు దానికంటే ఈ 1957–58 లో 90 లక్షల రూపాయలు ఎక్కువగా వున్నది. కాని Short fall 64 లక్షలు ఉంది. ఇంక Budget estimates లో 4 కోట్ల 97 లక్షలు ఖర్చు అవుతుందనీ, అనుకుంటున్నాము. ఈ సంవత్సరం 504 లక్షల రూపాయలు ఎందుకు ఖర్చు పెట్టలేదు? 440 లక్షల రూపాయలు ఎందుకు ఖర్చు పెట్టారు? అని అడుగుతున్నారు. ఈ 440-330 కంటే ఎంత ఎక్కువగా ఉన్నదో మీరే ఆలోచించండి. ఇంతకు ముందు సంవత్సరం విద్య కోసం 350 లక్షలు రూపాయలు ఖర్చు చేశారు. ఇప్పుడు 440 లక్షలు రూపాయలు వచ్చే సంవత్సరం 497 లక్షలు రూపాయలు ఖర్చు చేస్తారు. ఇంకా 57 లక్షల రూపాయలు తెలంగాణాలో ఖర్చు పెట్టాలని అనుకున్నాము. తెలంగాణా మీద శీతకన్ను వెయ్యడమని చెప్పడం న్యాయం కాదు. ఖర్చు పెట్టడం ఇష్టం లేదు, మిగులు బడ్జెటు చూపడానికే తెలంగాణాలో ఖర్చు చేయుటలేదు అనడం న్యాయం కాదు. అట్లానే వైద్యం విషయమై 1955–56 లో 80 లక్షలు ఖర్చు పెడితే ఈ సంవత్సరము రివైజు ఎస్టిమేట్లలో 136 లక్షలు ఖర్చు చేయాలని అనుకున్నాము. బడ్జెటు ఎస్టిమేటులో 138 ఉంది. It is a short fall of 2 lakhs but it is a big rise over 80 lakhs. వచ్చే సంవత్సరానికి 157 లక్షలు బడ్జెటు ఎస్టిమేట్లలో ఉన్నది. అట్లానే Public Health పద్దుకు ఇంతకు ముందు సంవత్సరం 49 లక్షలు రివైజ్డ్ ఎస్టిమేట్సులో ఉంది. వచ్చే సంవత్సరం 63 లక్షలు ఖర్చు పెట్టవలెనని అనుకుంటున్నాము.

వ్యవసాయ పద్దుకు 1955-56 లో రు. 39 లక్షలు ఖర్చు, 57-58 లో రు. 58.19 లక్షలు ఖర్చు అయింది. వచ్చే సంవత్సరంలో 83 లక్షలు తెలంగాణాకు ప్రొవైడు చేసేము. ఇంతకుముందు రు. 39 లక్షలు మాత్రము ఖర్చుఅయింది ఇప్పుడు రు. 59 లక్షలు ఖర్చు అవుతుంది.

అట్లానే పశువైద్య పద్దు. సహకారశాఖ 55-56 కు రు. 13 లక్షలు Revised estimates కు 17.85 వచ్చే సంవత్సరం 26.46 వేలు ఖర్చుపెట్టడానికి ప్రొవైడు చేసినాము. పరిశ్రమలకు ఇంతకుముందు 22.33, Rivised estimates లో 60.53 వచ్చే సంవత్సరం 78.47 వేలు ఖర్చు అవుతుందని లెఖ్ఖలలో ఉన్నది. ఈ లెఖ్ఖలు చూస్తే ఎవరైనా Impartial Critic తెలంగాణాకు ఖర్చుపెట్టలేదనడానికి వీలులేదు. అలాగానే విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా విషయమైకూడా లెఖ్ఖలు ఉన్నవి. సంవత్సరం, సంవత్సరం ఇంకా ఎక్కువ ఖర్చుచేస్తున్నట్లు నా దగ్గర లెఖ్ఖలు ఉన్నవి. పై సంవత్సరం ఇంకా ఎక్కువ ఖర్చుపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నాము. అందువల్ల short fall లన్నీ next year overtake చెయ్యడానికి కొంత ప్రయత్నం చేస్తాము అయిదు సంవత్సరాలు అయినప్పటికి తెలంగాణా 5.6 కోట్ల ప్లాను పూర్తికావడానికి అన్ని విధములా ప్రయత్నం చేస్తామని పదే పదే చెబుతున్నాను. ఒకనెల ఒకసంవత్సరం short fallవున్నది అంటే దానికి కారణము మన బసవరాజుగారికి తెల్సును. మైనరుఇరిగేషను అక్కడ కలక్టర్లవద్ద ఇక్కడ P.W.D దగ్గర ఉండడం ఇంకా ఈ Financial Code adminstratvie code, estimates అన్నీకూడా ఉన్నవి తెలంగాణాలో ఏది వర్తించపలెను అనే ఆలోచనలతో ఆలస్యము అయినది. మొన్న D.P.I గారిని అడిగితే ఈ code defficulties వల్ల ఇంతకాలము ఖర్చుపెట్టలేకపోయినాము అన్నారు. ఇదిగాక ఇండియా ప్రభుత్వంవారు ఉక్కు, సిమెంటు కొరతగా ఉన్నందువల్ల మరి కొత్తకట్టడములు ఏమీ తీసుకొనవద్దు అని చెప్పిన తరువాత Capital Expenditure క్రింద కొన్ని Buildings ను Provide చేస్తే ఖర్చుచేయలేకపోయినామని అన్నారు. Revised estimates లో ఎంత ఖర్చుపెట్టినాము, వచ్చే సంవత్సరం ఎంత తెలంగాణాలో ఖర్చుచేసేది 1955-56 లో ఎంత ఖర్చుచేసినారు అనే వివరాలన్నీ cyclostyle చేసి సభ్యులందరికిఇస్తే బాగాఉంటుందని అనుకొంటున్నాను.

శ్రీ కె. ఎల్. నరసింహారావు :-ఇంతకుముందు 5 నెలలది మాత్రము చెప్పేరు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:-మనకు 56 నవంబరులో ఆంధ్ర ప్రదేశ్ వచ్చినది. 56-57 లెఖ్ఖలుకూడా ఉన్నాయి. ఆ సంవత్సరంలో 5 మాసములే 1955-56 is the last year for Hyderabad accounts. ఆ సంవత్సరం base గా తీసుకున్నాము. తరువాత 1957-58 లో ఎంతఖర్చు పెట్టినారు. 1956-57 లో 5 మాసములే కనుక సరైన లెఖ్ఖలు రావు.

డాక్టర్ ఎం. చెన్నారెడ్డి (వికారాబాద్-జనరల్) :- 19 కోట్ల ఆదాయము 58 కోట్లకు పెరిగిన సంగతి వారికి తెలుసునా ? పెరగడం అంతా తెలంగాణా

లోనే కాదు. ఆంధ్రలో కూడా పెరిగింది. 1955-56 తో compare చెయ్యడము సరైన పద్ధతికాదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- ఇకదేనితో compare చెయ్యాలో నాకు తెలియడములేదు. ఏదో ఒక సంవత్సరం తీసుకోవాలికదా. Last year of Hyderabad Government basis గా తీసికొని అక్కడ నుంచి ఎంత ఖర్చు పెట్టబోతు న్నామో తీసుకుంటున్నాము. లేకపోతే comparison అనేది impossible అవుతుంది. మరి ఏ year తో తీసుకుంటే బాగుంటుందో నాకు తెలియడములేదు. 1955-56 complete year కాబట్టి అది తీసుకున్నాము.

డాక్టర్ ఎం. చెన్నారెడ్డి :- Corresponding increase in income రెండు ప్రాంతాలకు ఉన్నది. Increased expenditure ను provide చేసినప్పుడు అది దృష్టిలో పెట్టుకొని చెయ్యవలెను. అట్లు జాగ్రత్తగా వ్యవహారం చేస్తే చాలా సంతోషము.

శ్రీ పి. బసిరెడ్డి (పులివెందల):- అంతా తెలంగాణా విషయము చెపు తున్నారు గాని రాయలసీమ విషయము ఎప్పుడు చెబుతారు ?

మిస్టర్ ఛైర్మన్ :- సభ్యులు మొత్తం తెలంగాణా గురించి మాట్లాడు తున్నారు కాబట్టి రాయలసీమగురించి ఇప్పుడు చెప్పలేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- ఒక్కడే చెన్నారెడ్డిగారికి, ఇతరులకు చెపు తున్నాను. After all this is not the full year. 11మాసములు మాత్రము అయినది. ఇందుకు procedural difficulties ఉన్నవి. ఒకరిని ఒకరు అర్థము చేసికొనడం కొంత ఆలస్యము కావచ్చును. దానిలోఉద్దేశము ఏమి లేదు. తప్పకుండా వచ్చే సంవత్సరంగాని, మిగిలిన మూడు సంవత్సరాలలో short falls లేకుండా చేస్తాము. ఆ బాధ్యత మంత్రులమీద ఉన్నది, తప్పకుండా తీసుకొంటారు. వచ్చే సంవత్సరం నుంచి ఒక్కొక్క డిపార్టుమెంటులో ఎంత ఖర్చు అవుతుందో చెప్పగలము. అట్లు జరుగుతుందని ఆశిస్తున్నాను. ఇక ఆదాయము ఎక్కువ అయినది అంటే excise లో కొంత ఫారెస్టులో కొంత ఏదో సేల్సుటాక్సులో కొంత ఎక్కువగా ఉన్నది. నెలవారి లెక్కలు ఉన్నవి. ఆంధ్రలో ఎంతో, తెలంగాణాలో ఎంతో ఒక్కొక్క డిపార్టు మెంటులో ప్రతినెల ఎంతవస్తుందో జనవరి ఆఖరువరకు లెక్కలు ఉన్నవి. అవి చూస్తూఉంటే తెలంగాణా ముందుకు పోతున్నది అని అనిపిస్తుంది. ఇంకా పెంచు కొనవలసిన అవసరం ఉన్నది. మోటారుబళ్ళ పెట్రోలు సందర్భములో ఇంకా పెరగడములేదు. పెంచుకొనవలసిన అవసరం ఉన్నది. తెలంగాణా అభివృద్ధికోసము ఖర్చుపెట్టవలసిన అవసరం ఉన్నది. దీనిలో ఎలాంటి ఆరోపణ లేదని మరల నేను చెప్పుతున్నాను.

తెలంగాణా వారికి మిగులు ద్రవ్యం రిజర్వు నిధిగా ఉన్నది. 11 కోట్ల వరకు ఉన్నది. దీనికి average rate of interest 2 3/15 ఉంది. కొన్ని 1 3/4 కొన్ని 2% చొప్పున ఉన్నవి. మనము ఈనాడు తెలంగాణా కానీయండి ఆంధ్రకానీయండి ఏవైనా వాటిని అమ్మి కొత్తగా invest చేస్తే 4% వడ్డీ రావచ్చును. ఆంధ్రప్రదేశ్ ways and means ఈనాడు బాగాలేవు. ఆంధ్ర జిల్లాల వారివద్దే లెక్కలు వ్రాసి తీసుకొనవచ్చును. రిజర్వు బ్యాంకు వద్ద కొన్ని కోట్ల రూపాయలు అప్పు తెచ్చుకున్నాము (11, 12 కోట్లు) దానిమీద 4% వడ్డీ ఇస్తున్నాము. మన రిజర్వు అక్కడ 2 3/4 earn చేస్తున్నది. మంచి మార్కెటు వస్తే ఈ ద్రవ్యం Credit ఇవ్వవచ్చు. Your reserves have been utilised for this purpose అని చెప్పడము న్యాయమైన విషయము కాదా అన్న మాటమీద మీరందరుకూడా ఆలోచించవలసిన అవసరం ఉన్నది. నామట్టుకు నేను ఇప్పుడు 2 3/4 earn చేస్తూ అక్కడ 4% ఇవ్వడం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు, in the long run తెలంగాణా వారికిగాని మంచిదికాదని అనుకుంటున్నాను. వీటిని అమ్మివేసి ఆమొత్తాన్ని మనము ఉపయోగించుకొనడము న్యాయమైన మార్గము. దానిని ఆమాదిరిగా lock up చేసుకొనడం మంచిదికాదు. దానిని ముట్టుకొనకూడదని తెలంగాణాకు కొన్ని apprehensions వస్తవని కొందరు అంటున్నారు. కాని long run లో మనకు నష్టము వస్తుంది అని అనుకొంటున్నాము. అందువల్ల ఆ ద్రవ్యము ఎవరికోసము ఖర్చు అగుతుంది అనే విషయముకాదు. లెక్కలుచూచుటే మంచిదనుకుంటాను. Short Falls వున్నమాట వాస్తవమే. కొన్ని Departments లో బడ్జటు ఎస్టిమేట్లకన్న ఎక్కువ ఖర్చు అయినది.

తెలంగాణాకు సంబంధించి Civil Works కోసము Budget Estimate 109 లక్షలు వుంటే 116 లక్షలు revised estimate లో ఖర్చు అయింది. Public Health లో budget provision 6 లక్షల 38 వేలు వుంటే 18 లక్షల 91 వెయ్యి revised estimate లో ఖర్చు ఐంది. Industrial Development క్రింద provision 10 లక్షలు వుంటే 28.11 లక్షలు revised estimate లో ఖర్చు ఐంది. Budget Estimate క్రింద 113.66 లక్షలు మాత్రమే provision వుంటే 173.7 లక్షలు ఖర్చు కాబోతూవున్నది. Miscellaneous Departments క్రింద Budget లో 44 లక్షలు వుంటే 48 లక్షలు revised estimate లో ఈనాడవుతున్నది. కాబట్టి కొన్నికొన్ని departments అనుకున్న దానికంటేకూడా ఎక్కువ పెరిగినవి. ముఖ్యంగా Electricty, Industrial Development, Public Health ఇంకా యితర డిపార్టు మెంటులలో కొన్నిటిలో short falls కూడా వున్నాయి, కాబట్టి నేను చెప్పదలుచు

కొన్ని విషయము ఏమిటంటే వేరే దురుద్దేశముతో with hold చేసి దానికి sanction యివ్వకూడదనే మాటకాదు. కొన్ని Administrative గా interest గా వున్నటువంటి యిబ్బందులువున్నాయి. Procedure లో కొన్ని difficulties వున్నాయి ఇక్కడ ఒకరకమైనటువంటి code వుండినది. అక్కడ ఒకరకమైనటువంటి code వుండినది. ఈ minor irrigation P. W. D. లో వుండడమువల్ల కొన్ని ఇబ్బందు లున్నాయి. ఉండబట్టే కొని కొన్ని short falls వున్నాయి. దీనికి బుద్ధిపూర్వకంగా ఏ డిపార్టుమెంటు కాని, ఆంధ్ర Ministers కాని, తెలంగాణా Ministers కాని ఎవరై నప్పటికికూడా ఏమాత్రము ఇతర తలంపు లేదని నేను పదేపదే చెప్పుతున్నాను. ఈ లెక్కల నన్నింటినికూడా మనము చూచుకోవచ్చును. ఈ లెక్కలలోకూడా ఒక చిన్న anomaly వున్నది. ఇది మీకు చెప్పితే మంచిదేమో అని అను కుంటాను.

శ్రీ పి. సుందరయ్య:- ఇపుడు మీరు తెలంగాణాను గురించి చదివిన బడ్జట్ లెక్కలకున్నూ బడ్జట్ మెమోరాండమ్‌లో యిచ్చిన లెక్కలకున్నూ differences వున్నాయి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- Demands లో రైజుచేయండి.

శ్రీ పి సుందరయ్య:- నేను దీనిని general policy క్రింద చెప్పు తున్నాను. అది Demands లో రాదు. ఇపుడు మీరు తెలంగాణాలో వివిధ Heads క్రింద చూపి 1957-58 original estimates కు revised estimates కు ఖర్చు పెట్టినామని కొన్ని పద్దులు చదివారు. Budget Memorandum లో మీరు చదివిన దానికంటే తక్కువ ఖర్చు పెట్టినట్లువున్నది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- వారికి ఆ Budget Memorandum ఎవరు యిచ్చినారో నాకు యిచ్చినవాండ్లుకూడా వాండ్లే. Finance Department వాండ్లు. దానినిగురించి తర్వాత కావాలంటే మాట్లాడుకుందాము. దానికిన్ని నేనుచెప్పినదానికిన్ని ఏదైనా discrepancy వుంటే చూదాము. He can verify it from the Finance Department. ఈ Budget లో ఏమి ఇచ్చినాము ? తెలంగాణాలో ఎంత వస్తుంది ఎంత ఖర్చు ఔతుంది ? దానిలో ఒక చిన్న discrepancy వున్నది. దానిని చెప్పితే బాగుంటుంది అనుకుంటాను. ఇప్పుడు ఈ Heads of Departments Legislative Secretariatలో High Court లో Secretariat లో Board of Revenue లో $\frac{1}{3}$ తెలంగాణాకు $\frac{2}{3}$ ఆంధ్రకు అని లెక్కలు వేస్తున్నాము. ఇప్పుడు కర్నూలు విష యం తీసికోండి. కర్నూల్‌లో గవర్నమెంట్ ప్రెస్ వున్నది. కేవలము అది కర్నూల్‌కు కర్నూల్ జిల్లాకు సంబంధించినది కాదు, దానిమీద ఖర్చు అయ్యే

దంతా కర్నూల్ మీదనే వున్నది ఈనాడు. ఇంక D.P.I. office వున్నది. Deputy Commissioner's office వున్నది అక్కడ. దానిమీద అయ్యే ఖర్చంతాకూడా కర్నూల్ మీదనే వుంది. అది న్యాయంగా Provincial office గా తీసికొని దాని ఖర్చుకూడా 2/3 ఆంధ్ర 1/3 తెలంగాణా అనే మాట చెప్పవచ్చును. కాని అది జరుగడం లేదు. ఈ లెక్కలన్నిటినీ అణాలు పైసలలో చూపించవలసినటువంటి అవసరము లేదనుకుంటాను. టూకీగా తీసుకున్నామనుకోండి హైదరాబాదులో వున్నటువంటి provincial offices అన్నికూడా 2/3, 1/3 అనే ratio లో వున్నవి. ఇంకా కొన్ని ఆఫీసులు కర్నూల్‌లోనే వున్నవి. అవి regional offices కాదు. వాటికయ్యే ఖర్చంతాకూడా కర్నూల్ మీదనే చూపించబడుచుంది. రెండవదేమిటంటే ఈ 2/3, 1/3 proportion కూడా న్యాయమైనది కాదేమో ననుకొంటాను. నేను ఈ Legislature Secretariat లో offices proportion ఎట్లున్నదని అడిగినాను. అటులనే Board of Revenue లో Secretariat లోకూడా వుండవచ్చును. It is not really 1/3 Telangana and 2/3 Andhra officers ఇప్పుడు Legislative Secretariat లో These are the figures–Gazetted Officers ఆంధ్రనుంచి ముగ్గురు. తెలంగాణావాండ్లు ముగ్గురు వున్నారు. Permanent non-gazetted officers ఆంధ్ర నుంచి ఆరురు వుంటే తెలంగాణా వాండ్లు 42 వున్నారు. Last grade permanent people ఆంధ్ర నుంచి 24 మంది వుంటే 54 మంది తెలంగాణా వాండ్లు ఉన్నారు.

శ్రీ పి. సుందరయ్య:— మనుష్యుల సంఖ్య చెప్పారు దానితోబాటు వాండ్ల కిచ్చే డబ్బు సంగతికూడా చెప్పి అదే రకంగా అన్ని Departments లో చెప్పితే బాగుంటుంది. ఈ రకంగా చెప్పితే ఏమి ఉపయోగము లేదని అనుకుంటాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— వారు ఉపయోగము లేదంటారు. కాని నేనిదంతా ఎందుకు చెప్పుతున్నానంటే కొంతమంది సభ్యులు ఇంత critical గా మీరంతా కోట్ల రూపాయలు తీసుకొని పోతున్నారని చెప్పినపుడు defencive గానైనా నేను కొన్ని కొన్ని విషయములు చెప్పవలసి వుంది, లేకపోతే యీ విషయాలు చెప్పవలసివుంది. లేకపోతే యీ విషయాలు చెప్పవలసిన అవసరమేమీ లేదు. తెలంగాణానుంచి కోట్లకొలది రూపాయలు ఎవరు తీసుకొనిపోయినారు. 11 కోట్ల రూపాయలు Reserve Bank లో వున్నది. తినబోతున్నారు. అపహరించ బోతున్నారు. అనేటటువంటి feeling వస్తున్న సమయంలో ఈ figures ఇంకా critical గా చెప్పవలసిన అవసరముకూడా వుందనుకుంటాను.

ఈమాదిరిగా బాధలున్నాయి. ఒకరు తెలంగాణా అంటే ఇంకొక గౌరవసభ్యులు రాయలసీమ సంగతి ఏమి అంటారు. మంతెన వెంకటాద్రిజుగారు మా గుంటూరు జిల్లానుంచి ఎంత వచ్చింది మీరు ఎంత ఖర్చుపెడుతున్నారని ఇంకొక question

వేయవచ్చును. ఒక తెలంగాణాకు పరిమితమైందిగా చేయడానికివీలులేదు. శ్రీకాకుళం జిల్లా వాండ్లు అడుగవచ్చును—మా జిల్లానుంచి మీరు ఎంత వసూలుచేస్తున్నారు మాకోసము ఎంత ఖర్చుపెడుతున్నారని. ఒకరు ప్రారంభించిన తర్వాత ప్రతివారు కూడా అడుగవచ్చును.

శ్రీ పి. సుందరయ్య:- ఏ గ్రామానికి ఆ గ్రామము అడుగవచ్చును. కాని అడిగిన గ్రామముల కన్నిటికీ యివ్వలేము. యిచ్చినది తెలంగాణాకే.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- తెలంగాణాకు యిచ్చిన హామీలను భగ్నము చేయాలనే తలంపులేదు. అటువంటి కార్యక్రమము జరగడములేదని చెప్పుతున్నాను. నేను officers విషయమును గురించి దర్యాప్తు చేస్తున్నాను. నేను ఇక్కడికి పొద్దుననే వచ్చి దర్యాప్తుచేశాను—ఎంతమంది ఆంధ్ర officers, ఎంతమంది తెలంగాణా officers వున్నారని, అటులనే Board of Revenue లో అడుగుతాను. రేపు పొద్దున Secretariat లో అడుగుతాను. నేను తప్సీల్ చేసి దానినేమో చేయాలనే ఉద్దేశ్యముకాదు. అసలు 1/3 and 2/3 కూడా correct కాదు. అది arbitrary గా మనము తీసుకొన్న figure. ఇప్పుడు population కూడా చూడండి population కూడా అసలు 1/3 and 2/3 కాదు. తెలంగాణాలో population 108 lakhs వుంటే ఆంధ్రలో 202 lakhs వుంది. ఇక్కడ అసెంబ్లీలో 105 మంది తెలంగాణా సభ్యులు వుంటే ఆంధ్రనుండి 196 మంది మాత్రమే వున్నారు. Let us not be minute in these matters. దానిని ఇంత తప్సీల్ గా చూచి తూకముచేయవలసిన అవసరములేదు. Telangana is not really1/3. It is more than 1/3 and Andhra is not 2/3. It is less than 2/3 ఖర్చులో మాత్రము 2/3 and 1/3 అంటున్నాము. అంతేకాకుండా ఇంకొక చిన్న అనామలీకూడా వుంది, మన Income-tax విషయాన్ని తీసుకొందాము. మీరు Budget memorandum లో చూస్తే తెలుస్తుంది. Government of India నుంచి ఆదాయము వచ్చినపుడు మాత్రము 1/3 and 2/3 గా deal చేయలేదు. Papulation basis మీద తీసినారు. Income-tax లో ఎంతవస్తూందో మీరు Budget memorandum లో కావాలంటే చూడండి. Government of India నుంచి మనకు కొంత వస్తుందనుకోండి. దానిని 1/3 and 2/3 క్రింద లెక్క చూపించడములేదు. తెలంగాణాకు వచ్చేది is more than 1/2 ఆంధ్రకు less than 2/3 వస్తుంది. అటులనే Excise duties, Railway taxes లో వచ్చే ఆదాయాన్ని మాత్రము Population percentage మేరకు చూపించబడింది. ఇక్కడ ఖర్చుకు వచ్చేటప్పటికి 1/3 and 2/3 చూపించడము జరిగింది. కర్నూల్ లో జరిగిన Expenditure కర్నూల్ మీదనే చూపించబడింది, ఈ Pool లోనికి తీసికొని రాలేదు. తర్వాత ఆఫీసర్ను విషయంలో

కూడా 1/3 and 2/3 కాదు. కాబట్టి ఇవన్నీ కూడా అంత accurate గా చూపించ డానికి వీలులేదని యీ anomalies ను నేను చూపిస్తాను. కాని దానిని upset చేయాలనే ఉద్దేశము కాదు.

ఒకనాడు ఆఫీసర్సుకు సంబంధించిన విషయాలు ఇక్కడా బయటా వచ్చినవి. సీనియారిటీనిబట్టి చూస్తే ఒక్కొక్కసారి తెలంగాణావారికి ఒక్కొక్కసారి ఆంధ్ర ప్రాంతంవారికి లాభించవచ్చు. కొంతమందికి రాపిడ్ ప్రమోషన్సు వస్తున్నాయి. ఈ ఎమాల్గమేషను జరుగకపోతే ఆ విధంగా వచ్చిఉండేవికావు. ఎమాల్గమేషను వల్ల కొన్ని శాఖలలో తెలంగాణావారికి మరికొన్ని శాఖలలో ఆంధ్ర ప్రాంతంవారికి లాభం జరిగింది. ఈ మధ్యన మూడు రోజులు క్రితం డిప్యూటీ కలక్టర్లనుంచి కలక్టర్లుగా ప్రమోటు చేయవలసిన వారిని గూర్చి చర్చ వచ్చింది. యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషనువారు, రెవిన్యూ బోర్డు మెంబరు, రెవిన్యూ శక్రెటరి మొదలగువారు కూర్చుని పరిశీలించారు. దానిని బట్టి తెలంగాణా ప్రాంతంవారు ఎనిమిది మందికి ఆంధ్ర ప్రాంతంవారు ముగ్గురకు ప్రమోషనుకు అవకాశముంటుంది. బహుశ యీ విషయం సంజీవరెడ్డిగారికి కూడా తెలిసివుండదు. నేను రివెన్యూ శక్రటరిని అడిగాను గనక నాకుతెలిసింది. ఇది ఏదో కోపంతో చెబుతున్నాననుకోవద్దు, కొన్ని సంద ర్భాలలో ఆ విధంగా జరగవచ్చు. యీమధ్య ముగ్గురు సూపరింటెండింగు ఇంజనీర్లను ప్రమోషను చేయవలసివస్తే ఆ ముగ్గురు తెలంగాణావారే కావడం జరిగింది. నాకే ఇది అసహ్యంగా ఉందని నేను తెలంగాణా వాడను కనుక యీ విధంగా అంటారేమో నని శ్రీ నరశింగరావుగారు భయపడ్డారు. ఆ విధంగా భయపడ నవసరంలేదని నేను చెప్పాను. సీనియారిటీ ఉన్నట్లయితే తెలంగాణావారు కానివ్వండి, ఆంధ్రప్రాంతం వారు కానివ్వండి వారిని ప్రమోటు చేయవలసిందే అన్నాము. మా నెల్లూరులో ఉన్న సూపరింటెండింగు ఇంజనీరు తెలంగాణా ఆఫీసరు. అదేవిధంగా అనంతపూరులో ఉన్నవారుకూడ తెలంగాణా ఉద్యోగే. కొన్నికొన్ని శాఖలలో తెలంగాణావారికి అడ్వాంటేజి వస్తున్నది. కొన్ని కొన్ని శాఖలలో ఆంధ్ర ప్రాంతం వారికి అడ్వాం టేజి వస్తున్నది, ఎడ్వాంటేజి వచ్చినదాన్ని మరచిపోయి అడ్వాంటేజి లేనిచోట అన్యాయం జరిగిందని దాన్ని గురించి చెప్పడం మంచిది కాదు.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు:- ఆంధ్రలో యీవిధంగా ఎవరి కయినా అడ్వాంటేజి వచ్చిందేమో సెలవిస్తారా?

డాక్టర్. బి. గోపాలరెడ్డి:- ఈ మాదిరిగా కొన్ని సందర్భాలలో జరుగ వచ్చు, ఐతే ఏ ఒక్క ప్రాంతంవారికి అన్యాయం చేయడం లేదు. ఇద్దరు తెలం గాణా ఆఫీసర్లు, ఇద్దరు ఆంధ్ర ఆఫీసర్లు కూర్చుని సీనియారిటి లిస్టు తయారుచేస్తున్నారే కాని దీనిని ఏ శాఖ శక్రెటరీగాని, ఏ మినిస్టరోగాని చేయడంలేదు. ప్రతి డిపార్టు

మెంటుకు కూడ రెలిటివ్ సీనియారిటి లిస్టు తయారు చేసేటప్పుడు, ఇద్దరు తెలంగాణా ఆఫీసర్లు, ఇద్దరు ఆంధ్రా ఆఫీసర్లు కూర్చుని చేస్తున్నారు. బహుశ చీఫ్ శక్రెటరీగారు కూడా ఉండవచ్చు. అందువల్ల అడ్వాంటేజి వచ్చినపుడు తీసుకుని అడ్వాంటేజి లేని చోట కంప్లయింటు చేస్తే న్యాయం కాదేమోననుకుంటాను.

ఇక కమర్షియల్ టాక్సుకు సంబంధించినంత వరకు కొన్ని విషయాలను మన రాజలింగంగారు చెప్పారు. ఈ విషయంలో నేను కొంత సమాధానం యివ్వవలసిఉంది. కాబట్టి కమర్షియలు టాక్సు డిపార్టుమెంటు డిమాండుకు కూడ బడ్జటు చర్చలలో అవకాశమిప్పించ వలసిందని మన ఛీఫ్ విప్‌గారిని కోరినాను. కాని మన బిజినెస్ అడ్వయిజరీ కమిటీవారి నిర్ణయం ప్రకారం కమర్షియల్ టాక్సుశాఖ చర్చకు రాకపోవచ్చు. అందువల్ల ఇప్పుడే ఒక అయిదు నిమిషాలు కమర్షియలు టాక్సును గురించి మనవి చేస్తాను.

గతసంవత్సరము రెవిన్యూబోర్డు మెంబరు శ్రీ హైదర్, అగ్రికల్చర్ డిపార్టుమెంటుశక్రెటరి శ్రీ రాజేశ్వరారావుగారలు తెలంగాణా తరపున సేల్సుటాక్సు కమిషనరు శ్రీ యం.పి.పాయ్, రెవిన్యు శక్రటరి శ్రీ యం.టి. రాజుగార్లు ఒకకమిటీగాకూర్చుని సేల్సు టాక్సు డిపార్టుమెంటుకు సంబంధించినంతవరకు కొన్ని నిర్ణయాలుచేశారు. వారు నలుగురు కలసి ఏకగ్రీవంగాచేసిన రికమెండేషనులను అమలుపరచాము. కొన్ని కొన్ని చర్యలు తీసుకున్నాము. ఒకవేళ కొందరు అన్యాయంజరిగిందని అనవచ్చు. అటువంటిది జరుగకుండా మేము ప్రయత్నంచేస్తాం. ఆ నలుగురు ఏకగ్రీవంగా చేసిన తీర్మానాలనే అమలుచేస్తున్నాముగాని వేరువిధంగా మేముచేయడంలేదు. సేల్సుటాక్సు శాఖలో ఆరుగురు ఫస్టుగ్రేడు ఆఫీసర్లున్నారు. వారిపై ఒక ఇన్‌స్పెక్టింగుఆఫీసరున్నారు. యీ 7 గురుగాక 15 మంది సెకండుగ్రేడు ఆఫీసర్లున్నారు. వీరు రు 275—425 ఇ.బి. 450 స్కేలులో ఉన్నారు. మొత్తంమీద 22 గురు గెజిటెడ్ ఆఫీసర్లు సేల్సుటాక్సు శాఖలో తెలంగాణాప్రాంతంలో పనిచేస్తున్నారు. ఈ 22 మందిలో 11 మంది హైదాబాదు, శికిందాబాదులలోనే ఉన్నారు. ఈ జంటనగరాలలో 11 సర్కిల్సున్నాయి. యీ 11 సర్కిల్సుకు 11 మంది ఆఫీసర్లుండినారు. మదాసు రాష్ట్రంలో నేను కమర్షియల్‌టాక్సు డిపార్టుమెంటు చూస్తున్న రోజుల్లో, మదాసుసిటీలో ఇద్దరు ఆఫీసర్లుమాత్రం ఉండేవారు. హైదాబాదు, శికిందాబాదు నగరాలలో అప్పుడు సేల్సుటాక్సురెవిన్యు రెండు కోట్లచిల్లరుండగా మదాసుసిటీలో నాలుగు కోట్లువచ్చేది. మదాసుసిటిలో ఇద్దరు గెజిటెట్ ఆఫీసర్లు ఉండగా ఇక్కడ 11 మంది ఉండేవారు. అటువంటి సందర్భంలో మేము యీ డిపార్టుమెంటును రీ—ఆర్గనైజ్ చేయవలసివచ్చింది. హైదాబాదు నగరంలో నలుగురు సి. టి. వోలు ఉంటేచాలునని మేము భావించాము. కమర్షియల్ టాక్సెస్ డిపార్టుమెంటులో ఎ.సి. టి. వొలు డి, సి. టి. వొలు సి. టి. వొలు అనే మూడుతరగతుల ఉద్యోగులున్నారు.

తెలంగాణాకు సంబంధించినంతవరకు ఎనిమిది జిల్లాలకు ఎనిమిది సర్కిల్సు హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాలకు నాలుగు సర్కిల్సు ఏర్పాటు చేశాము. అంటే మొత్తం 12 గురు గెజిటెడ్ ఆఫీసర్లకే అవకాశమున్నది. కాని ఇక్కడ 22 గురు గెజిటెడ్ ఆఫీసర్లున్నారు. అంటే 10 మంది అదనంగా ఉన్నారన్న మాట. అదనంగా ఉన్న ఈ పదిమందినీ ఏమి చేయాలి అను విషయంలో కొంత ఆందోళన జరుగుతున్నది. ఈ పదిమందికికూడ వారి జీతాలలో ఏమీ నష్టం రాలేదు. వారు ఏ జీతాలలో ఉన్నారో ఆ జీతములనే ఇప్పుడు కూడా పుచ్చుకుంటున్నారు. ఒక దమ్మిడీ కూడ వారికి నష్టం లేదు. వారు రు 275-450 గ్రేడులో ఉన్నారు. వారు గెజిటెడ్ ఆఫీసర్లుగానే ఉంటున్నారు, ఈ ఆఫీసర్లు అదనంగా ఉన్నారని మేము ఇంటికి పంపించివేయలేదు. వారికి ఎలాంటి నష్టంలేకుండ వారిని డి. సి. టి. వో-గెజిటెడ్ అనే మాదిరిగా చేశాము. నలుగురు పెద్ద అధికారులు ఏకగ్రీవంగా చేసిన సిఫార్సు ప్రకారమే యీ విధంగా మేము చేశాము ఈ డి. సి. టి. వోలు రు. 275-450 గ్రేడులో ఉన్నారు గనుక వారిని సి.టి.వో లతో సమానంగా ఎంచడానికి వీలులేదు. వీరిని డి. సి. టి. వోలకు సమానముగా ఎంచవలెనని నలుగురు పెద్ద అధికారులు శిఫార్సు చేశారు. దాని ప్రకారం వారికి జీతం నష్టంలేకుండా వాళ్ళ గెజిటెడ్ ర్యాంకుకు నష్టం లేకుండా వారి డి. సి. టి. వో గెజిటెడ్ అనే ర్యాంకు పెట్టాము. ఇటువంటి ఆఫీసర్లలో ఏడుగురు మాత్రమే ఫస్టుగ్రేడు వారున్నారు. ఇప్పుడు 12 మంది సి. టి. వోలు కావలెను కాబట్టి సెకండు గ్రేడులో వున్న 5 గురును ఫస్టుగ్రేడుకు ప్రమోటు చేశారు. అంటే 5 మంది తెలంగాణా ఆఫీసర్లు సెకండు గ్రేడునుంచి ఫస్టుగ్రేడుకు ప్రమోటు చేయబడ్డారన్నమాట. వారు ఇంతకు ముందు రు. 275-450 గ్రేడులో ఉంటే ఇకముందు రు. 300-700 గ్రేడులో ఉంటారు. తక్కిన 10 మందికి జీతాల్లో నష్టంలేకుండా వారిని డి. సి. టి. వో గెజిటెడ్‌గా పరిగణిస్తుంటాము.

ఒకరకంగా చూస్తే కొంతమందికి అన్యాయం జరిగిందని అనుకోవచ్చు "ఇదివరకు మేము జిల్లా అధికారులుగా ఉన్నాము. కాని మమ్ములను ఇపుడు డి సి.టి. ఓలుగా మార్చినారు" అని అంటే అనవచ్చు. యీ విషయములో ఏమిచేయమంటారో చెప్పమని గౌరవసభ్యులను అడుగుతున్నాను. రీ ఆర్గనైజ్ చేయవద్దని ఎవరూ చెప్పరనుకుంటాను. మద్రాసులో ఇద్దరు ఆఫీసర్సుఉంటే ఇక్కడ నలుగురు ఆఫీసర్సును వేశాము, ఇదివరకు ఇక్కడ 11 మంది ఆఫీసర్సు ఉండేవారు. అదనముగా ఉన్న వారిని ఏమిచేయవలెనో నలుగురు అధికారుల కమిటీ సిఫార్సుచేసింది. దాని ప్రకారముగానే మేము రీ ఆర్గనైజ్ చేశాము. ఎవరికీ అన్యాయము జరుపలేదు.

ఒక డైరెక్టు రిక్రూటు‌ను శెలవు కాలంలో హైదరాబాదుకు తీసుకువచ్చారని విమర్శించారు. అతడు తరువాత నెల్లూరుకు పంపబడినాడు. ప్రభుత్వమునకు సంబంధించిన విషయముకాదుఇది. కమీషనరు చేసే నియామకాలు. ఆ కమీషనరు సర్క్యూర్లు

జిల్లాల వారు కాదు. రాయలసీమ జిల్లాలోవారుకూడకాదు. ఆయన వక అరవ సోదరుడు, ఐ. సి. యస్. ఉద్యోగి—ఆయనకు నెల్లూరువారంటే ప్రియం, కరీంనగర్ వారంటే అప్రియంలేదు. ఇటువంటి విషయాలను గురించి సేల్సుటాక్సు అడ్వయిజరీ కమిటీవారితో మాట్లాడుతాను. శ్రీ రాజలింగంగారు యీ విషయంలో చాల ఆవేదనతో మాట్లాడార్రు. వార్రు ఎపుడూ యీ విషయము నాతో చెప్పినదికాని వ్రాసినది కానిలేదు. ఇటువంటి విషయములలో, ఇటువంటి సందర్భములలో మనము ఒక రౌండ్ టేబుల్ సమావేశము మాదిరిగా అప్పుడప్పుడు కూర్చునిమాట్లాడుకుంటే అనుమానాలకు తావుండదని అనుకుంటాను. తరచు మాట్లాడుకోటానికి వీలు లేనందువల్ల యిటువంటి అపోహాలు పొడసూపవచ్చు కొందరకు అన్యాయము జరుగుచున్నదని ఎంచవచ్చును యీ విషయములో నేనొక మాట చెపుతాను. ఇదిమాత్రం వాస్తవము. ఆంధ్రా ఆఫీసర్సులో చాలామంది వాళ్లంతా సమర్థులని, తెలంగాణావారు సమర్థులుకారని అక్కడక్కడ కొందరు అనుకొంటూండవచ్చు, అలా అనుకొన్నందువల్ల తెలంగాణా ఆఫీసర్సుకు న్యాయంచేసినవారము కాదు. అది న్యాయమైన విషయం కాదు. తెలంగాణావారంతా Urdu knowing people, incompetent people, inefficient people అన్నందువల్ల వచ్చే లాభం లేదు. లేకపోతే ఆంధ్రలో అంతా superior అని మేమే పెద్ద మొనగాళ్ళము, మేమే సూపరింటెండెంట్సుము, మేమే అసిస్టెంటు సెక్రటరీస్ము, మా డ్రాఫ్ట్సు బాగుంటాయి" అని అనుకోవడమువల్ల లాభం లేదు. అందువల్ల నేను యీ సందర్భంలో ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. ఏ ఆంధ్ర ఆఫీసరుకూడా తెలంగాణావారంతా అసమర్థులని, ప్రొసీజరు తెలియదని అనుకొనుట పొరపాటు. వారు ఒక system of administration కు అలవాటుపడ్డారు. ఇవాళ ఆంధ్ర అడ్మినిస్ట్రేషన్ వచ్చినపుడు, అది వారికి నేర్పించి వాళ్ళను మీతో తీసుకుపోవాలిగాని, కేవలం ఆంధ్రులు superior, తెలంగాణా వారు incompetent అని అనుకున్నదానివల్ల ఈ మనస్పర్థలు ఎక్కువగుతాయేగాని ఏమీ ప్రయోజనం ఉండదు. I make this appeal to all the Andhra Officers, on the floor of the House, that they should not create that feeling among the Telangana Officers. వాళ్ళనుకూడా కలుపుకు తీసుకుపోవటానికి ప్రయత్నం చేయాలి. వాళ్ళకు తెలియని విషయాలు తెలియచెప్పాలి. అంతేగాని superiority complex. pose చేసినందువల్ల ఎవరికీ ఏమీ లాభంలేదని నేను అనుకుంటున్నాను. అట్లాగే తెలంగాణా ఆఫీసర్సు తాము ఒకదానికి అలవాటుపడ్డాము అని అనకుండా ఈ నాడు వచ్చిన కొత్త సిస్టమ్‌ను అది టాపెజాహామ్ సిస్టమ్‌గాని, ఏదైనాగాని— నేర్చుకొనుటకు ఎంతో ఉత్సుకత చూపించాలిగాని, "మేము 20 ఏళ్ళనుంచి యీ మాదిరిగా ఉన్నాము, యీరోజున ఎవరో, యీయన వచ్చి మమ్ములను యీమాదిరిగా చేయమంటున్నాడు" అనే మాదిరిగా reluctant గా ఉంటె ప్రయోజనంలేదు. అందువల్ల యీనాడు తెలంగాణా ఆఫీసర్సు యీరకమైన పరిస్థితులకు కొత్తవాతావరణానికి అలవాటు

పడటం నేర్చుకోవాలి. అంతేగాని వాళ్లపేటు, వీళ్లపేటు అనే భావన ఉండకూడదు. Some officer is incompetent అనవచ్చు. I don't mind. ఫలానా ఆఫీసరు incompetent అనవచ్చు. అంతేగాని తెలంగాణా వారంతా incompetent అన్నందువల్ల వారినందరినీ మీరు (ఆంధ్రా ఆఫీసర్సు) alienate చేసు కొనడం తప్ప ఇంకేమీకాదు. అందువల్ల ఆంధ్రా ఆఫీసర్సు వారి private talks లో గాని, పబ్లిక్ వ్యవహారాలలో గాని, అటువంటి feelings కు తావు యివ్వ కుండా ఉండవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను. మావారికూడా ఎవరైనా యీ విషయంలో తప్పుచేసియుంటే ఉండవచ్చు. ఎవరైనప్పటికీ తప్పులు చేయకుండా ఉండుట మంచిది. అందువల్ల ఆంధ్రులు superiority complex తో ఉండనక్కరలేదు. తెలంగాణావారు inferiority complex తో ఉండనక్కరలేదు. ఈ రెండూ సమస్య యంచేసుకొని వారు వ్యవహరిస్తే అందరికీ లాభంగా ఉంటుంది. ఆ విధంగా అన్ని ఆఫీసులలో నడుచుకొనవలెనుగాని తగాదాలుపెట్టుకుంటే ప్రయోజనంలేదు.

స్మాల్ సేవింగ్స్ గురించి చాలా విషయాలు వచ్చాయి. సుందరయ్యగారు కూడా చెప్పారు. ఇందులో ఉండే యిబ్బందులు మొదటనే చెప్పాను. 12 కోట్లు సంపాదించ వలసివుంటుందని చెప్పాను. 4 సంవత్సరము, 5 సంవత్సరములలో 90 కోట్లరూపాయలు రెండు సంవత్సరములలో ఖర్చుపెట్టుకొనే మాటకూడా మనము మనస్సులో పెట్టుకో వలసి యుంటుంది. ఇవన్నీ మనస్సులో పెట్టుకొని, తప్పకుండా యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను పూర్తిచేసుకొనవలసియున్నది. ఈ ఉద్రిక్తమైన వాతావరణం చల్లపడిపోయి, రీజియనల్ కమిటీ ద్వారా వైమనస్యాలు ఎక్కువ కాకుండా చూచు కోవాలి. వారికి కావలసినది ఏదైనా ఉంటే తప్పకుండా అడగవచ్చు. రీజియనల్ కమి టీలో ఫలాని విషయం గురించి మా వాళ్లు యీ విధంగా అంటున్నారు, ఏమి జరుగుతోందని, దానికి సంబంధించిన మంత్రిగారిని పిలిపించి అడిగి తెలుసుకొని ఎటువంటి misunderstandings లేకుండా చేసుకోవాలని, ఆవిధంగా రీజియనల్ కమిటీ ఉపయోగపడుతుందని నేను ఆశిస్తున్నాను. అంతేగాని యిది కేవలం ఒక ఉద్రిక్త వాతావరణం సృష్టించటానికి కాదు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి: సుందరయ్యగారు స్మాలర్ కమిటీ గురించి కూడ ఒక సూచన యిచ్చారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి: అది రీజియనల్ కమిటీవారు ముందు ఒప్పు కోవాలి. రీజియనల్ కమిటీవారు అటువంటి సూచన ఏదైనా చేసినప్పుడు తప్ప కుండా ప్రభుత్వం కూడా ఆలోచిస్తుంది. అన్ని పక్షాలకు సంబంధించి (105మంది ఉండేకన్న) చిన్నది ఒక కమిటీఉంటే మంచిదని వారికితోస్తే ఆలోచించవచ్చు. That suggestion must emanate from the Regional Committee. వాళ్లకు ఏది క్షేమముగా ఉంటుందో వాళ్లు సూచిస్తే బాగుంటుంది గాని సుందరయ్యగారు,

నేను, సంజీవరెడ్డిగారు సూచిస్తే అసలు రీజియనల్ కమిటీని సైడ్‌ట్రాక్ చేయటానికి ఏదో superimpose చేస్తున్నారనే మాట రావచ్చు. అటువంటిది రాకుండా మనము చూచుకోవలసియున్నది.

ఈ బడ్జటుమీద ప్రసంగంలో అనేకమంది అనేక విషయాలు చెప్పారు.

శ్రీ వి. కె. నాయక్ (సుల్తాన్‌బజార్); R. T. D. Corporation గురించి అది కొత్తగా ఏర్పడినది కాబట్టి దానిపాలసీ ఏమిటో చెప్పలేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నాయక్ గారికి చిన్న అనుమానం ఉన్నది. ఈ అస్సెట్స్ అంతా ఒకసారి కార్పొరేషన్‌కు ఇచ్చారు ఏమవుతుందో తెలంగాణాకు నష్టము కాదా?— అని వారికున్నది. కాని ఏ డిపార్టుమెంటులో నైనాసరే Electricity లో గాని, R.T.D. లో గాని—ఎక్కడా. నష్టము రాకుండా చేయవలసిన బాధ్యత మా 14 గురి మీద ఉన్నది. మీ అందరిమీద కూడ ఉన్నది, కాబట్టి ఆ విషయములో వారికేమీ సందేహాలు ఉండనవసరం లేదు.

తరువాత Finance Commission మనకు కేంద్రమునుంచి యివ్వబడే డబ్బు యింకా ఎక్కువ చేసియుంటే బాగుంటుందని చెప్పారు. చేసివుంటే నేనుకూడ సంతోష పడియుండే వాడిని, ఏమైనప్పటికీ మన బడ్జెటు మిగులుతో ముందుకు వస్తున్నదంటే—పన్నులు వేసుకొని (పన్నులు రుద్ది అని కాదు) ఎక్కువ ద్రవ్యము సంపాదించు కొంటున్నాము. లేకపోతే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తిచేసుకోలేము. దీనికి అందరి సహకారము కోరుతున్నాను. ముఖ్యముగా అపోజిషన్ వారి సహకారముకూడ కావలసి యున్నది. ద్రవ్యము సంపాదించి ప్రజలకోసము ఖర్చు పెట్టాలి. ఒక సంవత్సరము ఖర్చు పెట్టలేకపోతే అది ఎక్కడికీ పోదు. వచ్చే సంవత్సరమునకు ఉంటుంది. ఈనాడు మధ్యప్రదేశ్, పంజాబ్, ఆంధ్రప్రదేశ్ లవి surplus budgets. ఇంకా కేరళ బడ్జెటు రావాలి. ఈసారి మనము మిగులు బడ్జెటు అంటే——ఖర్చుపెట్టే మొత్తంకన్న ఆదాయం ఎక్కువ ఉన్నది. మన గంగారెడ్డిగారు మాట్లాడుతూ—మనవారు ఖర్చుపెట్టుకోలేక పోతున్నారు కాబట్టి surplus ఉన్నదన్నారు. అదికాదు. మనము ఖర్చు పెట్టుటకు నిశ్చయించుకొన్న దాని కన్న, రాబడి కొంచెము ఎక్కువగా ఉన్నది కాబట్టి surplus ఉన్నది. ప్లానింగ్ కమిషన్ ప్రకారము 30 కోట్లలోనే limit చేసుకోవలసి వున్నది కాబట్టి ఖర్చు పెట్టుకొనే వద్దుకన్న రాబడి ఎక్కువ ఉన్నదని అర్థముగాని యింకొకటికాదు.

కూర్మయ్యగారు కమ్యూనలిజం సంగతి చెప్పారు. నాకు తెలిసినంతవరకు హరిజనుల విషయంలోగాని, Backward Classes విషయంలోగాని, ఉన్న పరిస్థితులలో ఎక్కువ పనిచేయటానికి ప్రయత్నం జరుగుతోంది. ట్రైబల్ వెల్‌ఫేర్ విషయంలో

కూడా పని జరుగుతోంది. ఆనాడు లచ్చన్నగారు ట్రైబల్ వెల్‌ఫేర్‌కు ఎక్కువ సంపాదించాలని ప్రయత్నం చేశారు. అట్లానే ఈ నాడుకూడా ప్రయత్నాలు జరుగుచున్నవి. కేంద్రప్రభుత్వంవారుకూడ ఈ నాడు దీనికి ఉదారంగా డబ్బు యిస్తున్నారు. ఇవన్నీ క్రమేపీ చేసుకోవాలిగాని ఒకటి, రెండు సంవత్సరాలలో చేసుకునే విషయముకాదు. ఎంతోకాలం కష్టపడి కొన్ని పంచవర్ష ప్రణాళికలు మనదేశంలో పూర్తిచేసుకొని కొన్ని వేల కోట్ల రూపాయలు మనదేశములో ఖర్చుపెట్టుకుంటేగాని మనదేశంలోని ప్రజానీకము యొక్క అన్ని కష్టాలు పోతాయని అనుకోవడం న్యాయంకాదు. గౌరవ సభ్యు లనేక సూచనలు చేశారు. వారందరికీ ముఖ్యంగా Leader of the Opposition కు, తరువాత శాంతంగా అందరూ విన్నందుకు, అందరికీ నా హృదయపూర్వక నమస్కారములు చెబుతూ సెలవు తీసుకొంటున్నాను.

(హర్షధ్వనులు)

మిస్టర్ చైర్మెన్: ఈ సమావేశం యింతటితో వాయిదా వేయబడింది. తిరిగి రేపు ఉదయం గం. 8–30 లకు సమావేశమౌతుంది.

*The House then adjourned till Half Past Eight of the Clock on Saturday, the 8th March 1958.*

---